# శ్రీ జాషువకవిగారి ఖండకావ్యములు

| | | | | |
|---|---|---|---|---|
| ఖండకావ్యము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 3 వ భాగము | 1 | 0 | 0 |
| గబ్బిలము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| పిరదౌసి | | 1 | 0 | 0 |
| నేతాజీ | | 1 | 0 | 0 |
| బాపూజీ | | 1 | 0 | 0 |
| కాందిశీకుడు | | 1 | 0 | 0 |
| స్వప్నకథ | | 1 | 0 | 0 |
| ముంటాజ్‌మహల్ | | 1 | 0 | 0 |
| స్వయంవరం | | 1 | 0 | 0 |
| తెరచాటు (నాటకం) | | 1 | 8 | 0 |
| వీరాబాయి (నాటకం) | | 1 | 8 | 0 |



వలయువారు :—

## శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

# దాంపత్య జీవితము

[ రమణీయ ఘట్టాలు ]

రచయిత
శ్రీ మునిమాణిక్యం నరసింహారావు



పబ్లిషర్సు :
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు.
రాజమండ్రి.

# దాంపత్య జీవితము



## మొదటి రంగము

లక్ష్మమ్మ—కాంతం

లక్ష్మమ్మ—ఏం వదినా ఏం ప్రొద్దున్నే వచ్చావు? కూర్చో నీ కోడలు ఏంజేస్తున్నది?

కాంతం—ఆ ఏంజేస్తుంది. ఇంకా నిద్ర లేచిందో లేవనే లేదో దొరసాని!

లక్ష్మమ్మ—అదేమిటమ్మా! ప్రొద్దున్నే లేచి, నీకు సాయం చేయకపోతేమానె కాస్త కాఫీ కాచి మొగుడికి అయినా ఇస్తుందా? అదీ లేదా?

కాంతం—అయ్యో, అయ్యో. ఆ మాత్రం అయితే ఇంకా అనుకోవలసింది ఏముంది వదినా! ఆవిడ నిద్ర లేవటమే ఎనిమిదింటికి!

లక్ష్మమ్మ—అయ్యో అదేమిటి బాగానే ఉంది!

కాంతం—లేస్తుందా, లేచి, ముఖం కడుక్కోటం అదీ అయిన తరువాత స్నానం చేస్తుందమ్మాయ్ ప్రొద్దున్నే స్నానం చెయ్యకపోతేనేం!

లక్ష్మమ్మ—అదేమిటో ఆమెగారికి అదో అలవాటుట! పోనీ చేస్తుందా, దాని తరువాత వళ్ళంతా పౌడరు పూస్తుందెందుకమ్మా!

కాంతం—ఎందుకమ్మా పొడరు పూయటం ?

లక్ష్మమ్మ—ఏమిటో ! పూసుకొని ఆ పళంగా కాఫీకి తయారు ! కాఫీ తాగితేనేగాని ఏపనీ చెయ్యలేదుట వదినా, విన్నావా ఈ విడ్డూర్యం ఎక్కడన్నా ఉందా !

కాంతం—ఉండాలిసిందే ! నలభై ఏండ్లు వచ్చినవి. ఎప్పుడన్నా ఆ వెధవ నీళ్ళు నోట్లో పోసుకొని ఎరుగుదునా ?

లక్ష్మమ్మ—అది సరేగాని వదినా మీ అమ్మాయి తోడికోడలు వచ్చిందటగా ?

కాంతం—వచ్చిందమ్మా. అమ్మాయి, తోడికోడలూ ఇద్దరూ వచ్చారు.

లక్ష్మమ్మ—వాళ్ళిద్దరూ అక్కచెల్లెండ్రలాగ ఉంటారు కామాలు. ఒకరిని విడిచి ఒకరు ఉండలేకుండా !

కాంతం—అయ్యో ! అయ్యో ! అంత మాత్రం కూడా నాఏమిటో !

లక్ష్మమ్మ—ఏం, అట్లాగన్నావూ ? ఎల్లాగుంది అమ్మాయి సంసారం !

కాంతం—ఏం. సంసారమమ్మా ! ఆ అన్నగారు ఎంత చెపితే అంత ఈ తమ్ముయ్యగారు.

లక్ష్మమ్మ—ఎవరు మీ అల్లుడా !

కాంతం—అల్లుడేనమ్మా ! అన్నగారు గీచిన గీటు దాటడు. మొగుడే అల్లాగుంటే ఇక దీనిసంగతి చెప్పాలా ? అక్కయ్యకు అడుగులకు మడుగు లొత్తుతుంది.

లక్ష్మమ్మ—బాగా నేఉంది సంసారం. పోనీ వేరే ఉండ రాదూ! ఎవరి సోలెడు వారు కాచుకు తాగితే పోతుందిగా!

కాంతం—పడని స్తేనా. పడనిచ్చిచావదు. కలిసిఉంటే తింగు రంగా అని కూర్చుని దీనిచేత అడ్డమైన చాకిరీ చేయించ వద్దూ.

లక్ష్మమ్మ—అక్కడ చేయించుకోటం చాలక ఇక్కడికికూడా వచ్చిందన్నమాట!

కాంతం—లక్ష్మమ్మ వొదినా, నేను తెలియకఅడుగుతాను. నా బిడ్డ నాలుగురోజులు హాయిగా పుట్టింట ఉందామని వస్తే తను ఎందుకమ్మా తగుదునని రావటం!

లక్ష్మమ్మ—చెప్పాగా. అక్కడుంటే చేసేవాళ్ళు లేరని!

కాంతం—దీని దగ్గరమటుకు ఏంతుందిలే! ప్రొద్దున్నే ఆమెగారికి మన అమ్మాయి కాఫీ కాచి ఇస్తుందమ్మాయి!

లక్ష్మమ్మ—ఎందుకివ్వాలె కాచుకుతాగలేదా ఏమిటి?

కాంతం—ఆ సంగతి దీనికి తెలియాలె! ఎన్నిచెప్పినా వినదు. అక్కా. కాఫీ తయారైందిలే, అక్కా నీళ్ళుతోడాను స్నానంచెయ్యిఅక్కా! వడ్డించా।భోజనానికిరా అక్కా! ఇదీవరస. నాకు. అరికాలుమంట నెత్తికొస్తూఉంటుంది చెప్పొద్దూ! ఇక్కడ నా యింట్లోనే ఇల్లాగ చేయించుకొంటున్నదే, ఇక అత్తింట ఎంత చేయిస్తున్నదో.

లక్ష్మమ్మ—అంతేమరి! అయినా నేనుచెయ్యను నీవు నీ వారిడూ వేరేకాచుకుతాగు అని అనకూడదమ్మాఇది!

కాంతం—దీనినోట్లో నాలిక ఉంటేగా ? మూగ ముద్ద. అది ఎంతచెపితే అంతే !

---

రెండవరంగము

కామేశ్వరమ్మ—రాజేశ్వరమ్మ

కామే—సుభద్రమ్మ తోడికోడలువచ్చిందిచూశావా వదినా !

రాజే—సుభద్రమ్మ తోడికోడలు రావటం ఏమిటమ్మా!

కామే—మన కాంతమ్మ కూతురు సుభద్రను ఎరగవూ !

రాజే—ఎరగకేమమ్మా ! ఆఁ అయితే ?

కామే—ఆ సుభద్ర పుట్టింటికి వచ్చింది.

రాజే—ఆఁ వచ్చిందట విన్నాను. వెళ్ళి ఓసారి చూచిరావాలెనమ్మా. ఆ అయితే ?

కామే—సుభద్రతోపాటు సుభద్రతోడికోడలుకూడా వచ్చింది.

రాజే—తోడికోడలు రావటం ఏమిటమ్మా ! ఏదో శాస్త్రం చెప్పినట్లుగా ఉంది. (నవ్వి) తోచీ తోచనమ్మ తోడి కోడలు పుట్టింటికి వెళ్ళిందట ! అట్లాఉంది !

కామే—వచ్చింది వచ్చినట్లు ఉంటే బాగుండు.

రాజే—ఉండక ?

కామే—అసలు తోడికోడలు పుట్టింటికి రావటమే విడ్డూర్యమూ! వచ్చింది మొదలకుండా నాలుగురోజులుండి పోతే ఎంత బాగుండును.

రాజే—ఏంజేస్తున్న దేమిటి!

కామే—నీ వింకా వినవే లేదన్నమాట!

రాజే—నేను వినలేదు వదినా?

కామే—ఏదోనమ్మ మనకెందుకు ఒకరి గొడవలని నే నసలు పట్టించుకోను.

రాజే—అవునులే.

కామే—కాని ఊరంతా కోడై కూస్తుంటే.!

రాజే—అందాకా వచ్చిందీ!

కామే—రాదుటమ్మా. మరీ హద్దుమీరిపోతే.

రాజే—ఏమిటి వదినా? చెబుదూ!

కామే—మనకెందుకు? ఎవరెట్లాచస్తే మనకెందుకు. అవునా?

రాజే—అవునులే ఒకరిసంగతి మనకెందుకూ!

కామే—అవునామరి! అయితే ఇది పల్లెటూరుగదా వదినా పట్టణమూ ఏమన్నానా బూడ్సులు తొడుక్కుని టక్కు టక్కున తిరగటం ఏమిటిచెప్పు?

రాజే—బూడ్సులు తొడుక్కునే! ఎవరమ్మా!

కామే—ఇంకా ఎవరమ్మా. ఈ శాంతమ్మ. అదే సుభద్ర తోడికోడలమ్మా!

రాజే—సుభద్రతోడికోడలుపేరు శాంతమ్మా! ఆశాంతమ్మే! ఆడదానికిబూడ్సులేమిటి నాబొందా ఎప్పుడూవినలేదు.

కామే—ఆఁ ఆడది! ఆడవాళ్ళు ఆడవాళ్ళలాఁగ ఉంటున్నారా వదినా ఇప్పుడు?

రాజే—మొగరాయుళ్లై కూర్చున్నారు. బూడ్సులు! బూడ్సులే!

కామే—బూడ్సులమ్మా, బూడ్సులు! చెప్పాలన్నా కావు. బూడ్సులు వేసుకొని పైన టాక్ టాక్‌న నడుస్తుంది!

రాజే—బాగానేఉంది. అసలెందు కొచ్చిందమ్మా ఆశాంతమ్మ ఈవూరు! అదికనుక్కోలేదా ఎవరూ?

కామే—ఊరికే వస్తుందిటమ్మా!

రాజే—ఊరికే ఎందుకొస్తుందిలే ఏదోఎత్తుమీదే వచ్చుంటుంది.

కామే—ఎవరన్నా— ఈవూళ్ళో!

రాజే—ఏంఖర్మమో మనకేం తెలుస్తుంది?

కామే—అంతే అయిఉంటుందమ్మా, కాకపోతే ఈ బూడ్సు లేమిటి, ఈటాకు ఠీకు లేమిటి!

రాజే—ఛీ ఎంత అప్రదిష్ట! కాంతమ్మకు తెలిస్తే ఇంకేమైనాఉందా!

కామే—మనకెందుకులే వదినా! ఎవరి కర్మంవాళ్ళది. మాట వరుసకు అనుకొన్నాం గాని, ఎవరెట్లా ఏడిస్తే మనకెందుకు. ఏమంటావు ?

రాజే—అంతేలే వదినా, వస్తా—ప్రొద్దుఎక్కింది.

---

## మూ డ వ ర ం గ ము

### కాంతమ్మ—సీతమ్మ—యశోదమ్మ

సీత—అత్తయ్యా, ఏంజేస్తున్నావూ?

కాంతం—ఏం జేస్తాను, వంటపనేగా!

సీత—వదినేదీ?

కాంతం—సుభద్ర—దానితోడి కోడలూ కలిసి ఎవరింటికో వెళ్ళారే అమ్మాయి.

సీత—సరే కాని అత్తయ్యా! అదేమిటి ఆ శాంతమ్మ మరీ ఇద్దై పోయింది.

కాంతం—ఏమిటే సీతా!

సీత—ఆఁ నాకెందుకమ్మా—నేను అసలు ఒకరి సంగతి పట్టించుకోను.

కాంతం—అవును నాకా సంగతి తెలియదా ? ఎవరెట్టి వాళ్లైందిని!

సీత—ఆ బజారులో అనుకొంటూవుంటే విని, ఇదేమిటబ్బా అని ఆశ్చర్య పోయినాను.

కాంతం—ఏమిటే సీతా!

సీత—ఏముందీ—ఈవిడసంగతే!

కాంతం—ఎవరి సంగతి?

సీత—ఇంకెవరి సంగతి అత్తా. మీ శాంతమ్మ సంగతే!

కాంతం—అయ్యో! అయ్యో! అందరూ అనుకోసే కాడికి వచ్చిందీ—ఏం ఖర్మం అమ్మా. మా సుభద్రతల్లి, తాను వస్తూ వస్తూ ఆవిడను ఎందుకు రమ్మన్నదమ్మా !

సీత—అదే, పెళ్లికి వెడుతూ పిల్లిని చంకను పెట్టుకు పోయినట్లు! అంతా అనుకొంటున్నారు అత్తయ్యా.

కాంతం—ఏమిటే-ఏసంగతి?

సీత—అసలు శాంతమ్మ ఈవూరు ఎందుకొచ్చిందో కనుక్కున్నావా?

కాంతం—ఊరికేనే సుభద్రతో వచ్చానంటుంది.

సీత—ఎక్కడన్నా విన్నామా తోడికోడలు పుట్టింటికి రావటం.

కాంతం—అదే,

సీత—ఏదో పనిమీదే వచ్చిందమ్మా!

కాంతం—అంతే అయిఉంటుంది.

సీత—నీకూతురు వ్యవహారం కనిపెట్టాలని వచ్చిందనుకొంటా.

కాంతం—దానిబొండ ఏమున్నాయి కనిపెట్టటానికి.

సీత—ఉండాలె అత్తయ్యా! ఏదో వెధవమాటలు మాటలు పుట్టించటానికి.

కాంతం—అన్నీ ఏడ్సిందిలే!

సీత—ఏమన్నా కానీ గాని నీకు కోపంవస్తే వచ్చింది. ఈశాంతమ్మ వ్యవహారం ఏమీ బాగుండలేదు.

కాంతం—ఏమిటె సంగతి!

సీత—ఏంసంగతి కావాలె అత్తయ్యా. సంగతి చెబుతాను. అందరూ అనుకొంటూన్నారు అత్తయ్యా, ఆమె సంగతి ఏమీ బాగాలేదని.

కాంతం—నిజమేలే!

సీత—అత్తయ్యా, మనంసంసారులముకదా ఎవరైనా పెద్దమనిషి మన మొగాళ్ళకోసంవస్తే మనము ఏంజేస్తాము?

కాంతం—తలుపుచాటుననుంచుని లేరనిచెబుతాము.

సీత—నేను అసలు చెప్పను అత్తయ్యా. ఎందుకూ మనం పరాయివాడితో మాట్లాడటం. ఆవచ్చినాయన పెద్ద మనిషి అయితే రెండుసార్లు పిలిచి, ఇంట్లోలేరనుకొని వెళ్ళి వెళ్ళిపోతాడు.

కాంతం—అంతేననుకో. మాబోటి కాస్త పెద్దవాళ్లం చెప్పవలసి వస్తే, కంటబడకుండా చెపుతాము.

సీత—అవునామరి. నీవు ఇంట్లో లేవుకామాలు. చెరువుకు వెళ్ళివుంటావు. మామయ్య కోసం ఎవరో వచ్చి పిలిచారట.

కాంతం—వచ్చారు కామాలు. ఎప్పుడూ ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు?

సీత—సరే వచ్చారనుకో మొగాళ్ళకోసం ఎవరో రాకుండా ఉంటారుగనకనా వస్తే, ఆయన ఇంట్లో లేరని చెప్పితే సరిపోదూ,

కాంతం—అవునుమరి!

సీత—అవునా, ఈశాంతటా. ఆయనను కూర్చోమని కుర్చీ చూపిందట!

యశోదమ్మ ప్రవేశం

యశో—ఏమక్కయ్యా—ఏం జేస్తున్నావు?

కాంతం—ఏముందమ్మా—

యశో—ఎవరు కుర్చీచూపించింది అంటున్నావు? ఎవరి సంగతి అమ్మా?

కాంతం—మాకు ఉందిలే ఒకమారెమ్మ.

యశో—ఎవరు అక్కయ్యా?

కాంతం—ఇంకెవ్వరున్నారూ!

సీత—ఆఁ ఏంలేదు. సుభద్రవదిన తోడికోడలు సంగతమ్మా.

యశో—ఆఁహా శాంతమ్మ సంగతా. ఏమిటి చెప్పు చెప్పు.

సీత—ఎవరో పెద్దమనిషివస్తే మొగవాళ్ళు యింట్లో లేరని చెప్పి పంపక కుర్చీలో కూర్చోమన్నదట! విన్నావా అత్తయ్యా!

యశో—ఎక్కడా ఇది జరుగుతా?

కాంతం—ఇక్కడేనమ్మా, మాకొంపలోనే.

యశో—నీవెక్కడికి వెళ్ళావు ?

కాంతం—నేనెక్కడికో చచ్చాను. నేను లేనప్పుడే జరిగింది ఈగోల!

సీత—కుర్చీలాగి కూర్చోండి అన్నదట అత్తయ్యా.

కాంతం—అంటుందమ్మా. దానికేం అంటుంది దానిదేం పోయింది. అప్రదిష్ట నాకొంపకు. గాని!

యశో.—శాంతమ్మ సంగతి ఏమీ బాగుండలేదు కుర్చీ చూపించి కూర్చోమన్నది!

సీత—అదే చెపుతా! దీనిధైర్యంఏమిటో !

యశో—అటువంటి వాళ్ళకు ధైర్యానికేం? కుర్చీలో కూర్చోమని ఊరుకొందా? తనుకూడా పోయి పక్కన కూర్చున్నదా?

సీత—ఏమో అంతపని చేయలేదనుకొంటా!

కాంత—ఏమోనమ్మా, ఈఘోరాలు చూడలేకే నేను ఎప్పుడూ తలొంచుకు తిరుగుతాను.

యశో—తలొంచుకొని తిరుగుతామనకో కళ్ళబడక పోతే చెవునబడక మానుతయ్యా అక్కయ్యా!

కాంతం—దాని సంగతి పోనీయమ్మా. ఇదిగో పండగ వెళ్ళిన మరునాడే ఇద్దరినీ సాగనంపుతాను!

యశో—ఇటువంటి పనులు ఈవూళ్ళో పనికి రావని గట్టిగా చెప్పుఅక్కయ్యా.

కాంతం—చెబుమనమ్మా చెపటానికేం? మా సుభద్రే నానోరు నొక్కుతుందాయె! ఏంజేసేది!

సీత—నీవు అంతావినలేదు అత్తయ్యా. ఆవచ్చిన పెద్దమనిషిని కూర్చోబెట్టి, ఆయనకు ఎదూరుగా నుంచుని మీదేవూరు! ఎందుకు వచ్చారు? ఏంపనిమీద వచ్చారు? ఎవరు వచ్చారని చెప్పమంటారు? ఇల్లాగ ప్రశ్నలు కురిపించిందటమ్మా అదేంచిత్రమోగాని!

కాంతం—లక్ష్మమ్మ ఒదినా. ఏంజెప్పేదమ్మా. దాని తోడికోడలూ. అదీక్షణం ఇంట్లో ఉండరమ్మా. ఎవరింటికో ఒకరింటికి పెత్తనానికి వెడుతూనే ఉంటారు.

లక్ష్మమ్మ—అది సరేకాని వదినా. ఎట్లాగయినా ఈ వూళ్ళో కాస్త జాగ్రత్తగా ఉండాలమ్మ శాంతమ్మ!

కాంతం—ఉండొద్దమ్మా. ఇదేమన్నా బస్తీఅ, ఇష్టం వచ్చినట్లు తిరగటానికి.

లక్ష్మమ్మ—అవునామరి. నేను చెప్పేది వదినా ఫలాని వారి తోడికోడలు ఇల్లాగ అంటే. వచ్చే అప్రదిష్ట నీకేనా?

కాంతం—కాదుటమ్మా. కాక ఇంకెవరికి! మళ్ళీ ఏమన్నా కొత్త విషయం విన్నావా?

లక్ష్మమ్మ—నేను అసలు ఎన్నో వింటు ఉంటాను. బైటికి అననమ్మోయ్!

కాంతం—నీ సంగతి నాకు తెలియదా ఏమిటి?

లక్ష్మమ్మ—ఒకరిని గురించి నీలాపనిందలు వేయటం నాకు అసలు గిట్టదు.

కాంతం—అవును వదినా. ఎవరు ఎటువంటి మనిషి అయిందీ తెలియదా నాకు! నాకు తెలుసు అందరికీ తెలుసు.

లక్ష్మమ్మ—ఏదైనా విన్నా ఎక్కడ సంగతులు అక్కడే మరిచి పోతానమ్మోయ్.

కాంతం—కాక ఈ విషయాలు తీసుకెళ్ళి ఇంకొకరికి చెప్పిందాకా నీకేంపనిలే.

యశో—శాంతమ్మ బస్త్రీమనిషి కాదుటమ్మా అల్లా తయారైంది, సిగ్గూ భిడియమూ వదిలేసి.

కాంతం—అయితే అయింది. మా సుభద్రనుకూడా అల్లాగే తయారు చేస్తుందేమో !

యశో—చేయక ఊరుకొంటుందా ఏమిటి ?

సీత—వదిన మటుకు ఏం, తక్కువ తిన్నాదా ఏమిటి? దాని నెందుకు తీసుకు రావాలె !

కాంతం—అదో తెలివి తక్కువ దద్దమ్మ.

సీత—వెడతాను అత్తయ్యా. ఏదో అంతా అను కొంటూ ఉంటే ఇదేమిటా అని ఒచ్చాను—నీ వేమీ అను కోకేం !

కాంతం—ఏమీ అనుకోనమ్మ. మా ఖర్మం !

యశో—ఆ పచ్చిబోగందాన్ని ఎట్లాగయినా కాస్త కసిపెట్టి చూస్తుండు అక్కయ్యా. లేకపోతే పోయినా మరీ ఇదిగాడు ది !

---

## నా లు గ వ ర ం గ ము

కాంతమ్మ—లక్ష్మమ్మ—యశోదమ్మ,
రాజ్యం—సుభద్ర—శాంతమ్మ.

కాంతం—రా వదినా. కూర్చుందాం రా.

లక్ష్మమ్మ—ఏం వదినా తీరిగ్గాకూర్చున్నా వేంఇవ్వాళ. కూతురు - ఏంజేస్తున్నదమ్మా శాంతమ్మ ఒదినా !

కాంతం—లక్ష్మమ్మ ఒదినా. ఏంజెప్పేదమ్మా. దాని తోడికోడలూ. అదీక్షణం ఇంట్లో ఉండరమ్మా. ఎవరింటికో ఒకరింటికి పెత్తనానికి వెడుతూనే ఉంటారు.

లక్ష్మమ్మ—అది సరేకాని వదినా. ఎట్లాగయినా ఈ ఘూళ్ళో కాస్త జాగ్రత్తగా ఉండాలమ్మ శాంతమ్మ!

కాంతం—ఉండొద్దమ్మా. ఇదేమన్నా బస్తీఆ, ఇష్టం వచ్చినట్లు తిరగటానికి.

లక్ష్మమ్మ—అవునామరి. నేను చెప్పేది వదినా ఫలాని వారి తోడికోడలు ఇల్లాగ అంటే. వచ్చే అప్రదిష్ట నీకేనా?

కాంతం—కాదుటమ్మా. కాక ఇంకెవరికి! మళ్ళీ ఏమన్నా కొత్త విషయం విన్నావా?

లక్ష్మమ్మ—నేను అసలు ఎన్నో వింటు ఉంటాను, బైటికి అనసమ్మోయ్!

కాంతం—నీ సంగతి నాకు తెలియదా ఏమిటి?

లక్ష్మమ్మ—ఒకరిని గురించి నీలాపనిందలు వేయటం నాకు అసలు గిట్టదు.

కాంతం—అవును వదినా. ఎవరు ఎటువంటి మనిషి అయిందీ తెలియదా నాకు! నాకు తెలుసు అందరికీ తెలుసు.

లక్ష్మమ్మ—ఏదైనా విన్నా ఎక్కడ సంగతులు అక్కడే మరిచి పోతానమ్మోయ్.

కాంతం—కాక ఈ విషయాలు తీసుకెళ్ళి ఇంకొకరికి చెప్పిందాకా నీకేంపనిలే.

లక్ష్మమ్మ—అవునా వదినా, ఇవ్వాళ సాయంత్రము, నాలుగు గంటలకు, ఎందుకోనమ్మా. కిటికిలో నుంచి ఇల్లా చూశాను.

కాంతం—ఆ.

లక్ష్మమ్మ—ఊరికే చూశానేగాని ఇల్లాంటి పాపం కళ్ళబడుతుందని నాకేం తెలుసు వదినా!

కాంతం—ఏం పాపం వదినా?

లక్ష్మమ్మ—ఏముందమ్మా! ఎవరోనమ్మా నీ కూతురు ఎత్తు ఉంది. అయినా నీ కూతురు ఎందుకు అవుతుందిలే!

కాంతం—అబ్బే, మా సుభద్ర ఎందుకొస్తుంది అటుకేసి!

లక్ష్మమ్మ—అదే. నే ననటం, అదే! నీ కూతురులాగే ఉందమ్మా!

కాంతం—ఆ అయితే—?

లక్ష్మమ్మ—ఖద్దరు సిల్కుచీర కట్టుకొని బూడ్సులు వేసుకొని నడి బజారులో తక్కు తక్కున నడుస్తున్నదమ్మా!

కాంతం—ఇంకెవరూ! ఆ మారెమ్మే అయిఉంటుంది!

లక్ష్మమ్మ—నేను ఊరుకోలేదు చెప్పొద్దూ! ఎదటబడి నీ కేమైనా బుద్ధిఉందా లేదా అని నాలుగు చీవాట్లూ వేద్దామనే అనుకొన్నాను.

కాంతం—వెయ్యక పోయినావు?

లక్ష్మమ్మ—వేద్దామనే బైటికి వచ్చాను. ఇంతలో ఆ మనిషి మలుపు తిరిగిందమ్మా! ఆ మనిషి నీ కూతురు తోడికోడలే అనుకొన్నాను చెప్పొద్దూ!

కాంతం—అల్లా అనుకోక ఇ కేమి అనుకుంటావు ఒదినా!

లక్ష్మమ్మ—అల్లా అనుకొంటే నీకేం కోపంవస్తుందో అనుకొన్నా చెప్పొద్దూ! అయినా ఖద్దరు సిల్కుచీర ఈపూళ్ళో ఎవరికి ఉందమ్మా! అందులో చుక్కలచుక్కలది!

కాంతం—ఇంకెవరికుంది, ఆమూరెమ్మకే! మద్రాసులో కొనుక్కున్నదట!

లక్ష్మమ్మ—చూశావా, ఆ వేళప్పుడూ — ఆ వేషం ఏమిటో, ఆ వెళ్ళటం ఏమిటో!! ఎంతఘోరమో చూశావా?

కాంతం—ఘోరం కాదుటమ్మా! అతిఘోరం ఇంతకు ఎక్కడకు వెళ్ళిందో!

లక్ష్మమ్మ—ఎక్కడికి వెళ్ళిందోనమ్మా ఇట్టివాళ్లు ఏముంది ఎక్కడికైనా వెడుతారు.

కాంతం—షికారుపోతుందమ్మా! ఆమెగారికిషికార్లు ఏంజేస్తాం!

లక్ష్మమ్మ—అసలు సాయంత్రంపూట షికారు ఏమిటమ్మా! ఈపల్లెటూళ్ళో షికారుచేస్తే ఇకమర్యాద ఏమన్నా నిలుస్తుందా?

కాంతం—ఇంకా మర్యాదేమిటమ్మా! నాబొంద! అయితే ఇంతకూ ఎక్కడికి పోయిందంటావు?

లక్ష్మమ్మ—ఏమోవదినా ఎక్కడికి వెళ్ళిందో! శాస్త్ర కనుచీకటిగాఉంది అల్లాగ తిరువెంగళంగారి పొలాల మొగ దలకు వెళ్ళింది.

యశోదమ్మప్రవేశం

యశోదమ్మ—అక్కయ్యా! లక్ష్మమ్మ అక్కయ్య కూడా ఇక్కడే ఉంటే?

శాంతం—రావమ్మా యశోదమ్మా.

లక్ష్మమ్మ—రావమ్మా.

యశో—మీ రేదో మాట్లాడు కొంటున్నారు. పొలా ల్లోకి పోయిందంటున్నారు. మీశాంతమ్మ సంగతేనా?

శాంతం—నీకు కూడా తెలిసిందీ?

యశో—నాకేమిటమ్మోయ్ బాగానేఉంది. ఊ రంతా కోడై కూస్తుంటే.

లక్ష్మమ్మ—ఏమిటీ ఈసంగతే?

శాంతం—మాసంగతి అందరినోళ్ళలోపడ్డది లక్ష్మమ్మ వొదినా? నేనేం జెయ్యాలె!

యశో—బాగుంది. నీవేంజేస్తావు, ఖర్మం!

శాంతం—పొలాల్లోకి పోయిందిటమ్మా?

లక్ష్మమ్మ—చీకట్లో నమ్మా!

యశో—అవును, నేనూచూశాను. బాగా చీకటి పడ్డ తరువాతే.

శాంతం—నువ్వుకూడా చూశావూ?

యశో—చూశానమ్మా, ఆపాపం నాకళ్ళకూడాపడ్డది ఇంటిముందుగా వెడుతూఉంటే ఎట్లాగమ్మా చూడకుండా ఉండటం! ఈఅర్థరాత్రి అప్పుడు ఎక్కడికా వెడుతుంది అనుకొన్నాను.

లక్ష్మమ్మ—చీకట్లో ఎందుకు పోయిందమ్మా?

యశో—ఎందుకు పోదమ్మా నీదంతా విచిత్రంకాకపోతే ! అర్థరాత్రి ఏమిటి అపరాత్రి ఏమిటి అటువంటి వాళ్ళకు!

లక్ష్మమ్మ—అర్థరాత్రి పొలాల వెంట తిరిగేవాళ్ళు ఎంతపనైనా చేస్తారు. పొలాల్లోకి ఎందుకమ్మా వెళ్ళటం!

కాంతం—నాబొందకు? ఎక్కడికి వెళ్ళిందంటావు?

లక్ష్మమ్మ—నేనుచూడలేదువదినా! చూడనిమాటలు ఎందుకూ అనటం.

యశో—నేనూచూడలేదు. అల్లాగ రైలుస్టేషను వైపుకు పోతున్నారు.

కాంతం—పోతున్నారంటావు. ఇంకెవరన్నాఉన్నారా ఏమిటి వెంట?

యశో—లేకేం ఒక్క తేపోతున్న దనుకొన్నావా? ఆఁహా—ఆమెవెంట మీాఅమ్మాయే కామాలుడుంది.

కాంతం—మాసుభద్ర కూడావెళ్ళింది. దీన్నికూడా పాడుజేస్తున్నది. ఎట్లాచచ్చేదమ్మా!

యశో—నువ్వేంజేస్తావు అక్కయ్యా రోజులు అల్లాంటివి!

కాంతం—నీవు ఎక్కడ దాపరించావే శాంతమ్మ తల్లీ. నాకూతురును సరిగ్గా కాపరం చెయ్యనీయవుకామాలు!

లక్ష్మమ్మ—ఇదేం షికార్లోనమ్మా!

కాంతం—దీనిషికార్ల మండ!

లక్ష్మమ్మ—అదిగో సీత ఎందుకోపరుగెత్తుకొస్తున్నది.

యశో—ఏమి టేసీతా?

కాంతం—ఏమిటే అమ్మాయి — సీతా, ఏమిటి సంగతి?

సీత—కొంపమునిగింది అత్తా!

కాంతం—ఏమిటి చెప్పవే!

సీత—అంతా అనుకొంటున్నారు అత్తయ్యా పాపం పుణ్యం భగవంతుడికి తెలియాలె.

కాంతం—ఇంత విపరీతం ఎక్కడా ఎరగం? ఏమనుకొంటున్నారేసీతా?

సీత—సుభద్ర అక్కయ్యాను, శాంతఅక్కయ్యనూ కలిసి.

యశో—ఊ

కాంతం—కలిసి?

సీత—పొలాల్లో,

కాంతం—అయ్యో, అయ్యో, సుభద్రతల్లీ! ఎంత అప్రదిష్ట తెచ్చావే కొంపకు?

యశో—పోలాల్లోబడి?

సీత—ఎక్కడికో వెడుతున్నారు. అంతా చెప్పు కొంటున్నారు. అందరూ తలోమాట అంటున్నారు.

కాంతం—సుభద్రేనా ఆరెండోమనిషి!

సీత—కొందరు సుభద్ర అంటున్నారు, కొందరుకాదు పనిచేసే వెంకాయమ్మ అంటున్నారు!

కాంతం—వెంకాయె అయి ఉంటుంది మాసుభద్ర అల్లా వెళ్ళదు.

లక్ష్మమ్మ—ఇప్పుడెక్కడికి వెళ్ళింది?

కాంతం—వాళ్ళబాబాయి గారింటికి.

యశో—ఇంకేం, సుభద్ర కూడా లేకుండా చూచి తిరుగుతున్నదన్నమాట!

కాంతం—ఎంత అప్రదిష్ట.

యశో—నీ కూతురు దీన్ని ఎందుకు వెంటబెట్టుకొని వచ్చిందమ్మా?

కాంతం—ఎందుకని చెప్పేది. నానెత్తిన ఎక్కి తైతక్క లాడటానికి!

లక్ష్మమ్మ—ఇదెక్కడి గోలమ్మా కాకపోయినా చీకట్లో పడి పోయింది. లేనిపోని అప్రదిష్ట తెచ్చి పెట్టింది!

యశో—చీకట్లో అల్లాగ ఒంటరిగాపోతే నలుగురూ నవ్వుతారని అన్నా సిగ్గు ఉండనక్కరలేదుటమ్మా!

యశో—సిగ్గు ఉన్నమనిషి అయితే ఈవేళప్పుడు ఇల్లు కదులుతుందా ఎక్కడన్నా!

కాంతం—అదిగో రాజ్యం వస్తున్నది.

యశో—ఏమిటమ్మా రాజ్యం, ఎక్కడనుంచో పరుగెత్తుకొస్తున్నావూ?

లక్ష్మమ్మ—ఏమిటి ఏమన్నా క్రొత్తవిశేషాలు.

రాజ్యం—మీరింకా వినలేదన్నమాట!

కాంతం—ఏమిటే వినలేదంటున్నావూ?

రాజ్యం—ఈ పాడుకబరు నానోటితోనే చెప్పాలిసి వచ్చింది?

కాంతం—ఏమిటేవ్?

లక్ష్మమ్మ—ఏమిటి ఏమిటి దబ్బున చెప్పు.

రాజ్యం—ఏమోనమ్మా అంతా అంటున్నారో శాంతమ్మటా పోలాలవెంట పోయిపోయి రైలుస్టేషనులోకి పోయిందట.

లక్ష్మమ్మ—అయ్యో స్టేషనులోకే.

రాజ్యం—సరిగ్గా స్టేషనులోకి పోయింది.

కాంతం—దీనికేమి పొయ్యేకాలమోమరి అర్ధరాత్రి అప్పుడు స్టేషనులోకి పోవటానికి.

కాంతం—మాసుభద్ర రాలేదేం ఇంకా?

రాజ్యం—సుభద్రకూడా శాంతమ్మతో వెళ్ళింది.

లక్ష్మమ్మ—నేను చెప్పలేదు వదినా?

కాంతం—దీన్ని కూడా తీసికెళ్ళింది! అయ్యో సుభద్రతల్లీ. నీకాపరానికి ఈమారెమ్మ నీళ్ళుతోడుతుందే నిజమేనుటే రాజ్యం—

రాజ్యం—చూచిన వాళ్ళు అంతా చెబుతూ ఉంటేనా. పాలేరు చెప్పాడు. ఇంకెందుకూ?

కాంతం—ఛీఛీ. నాప్రాణాలు ఈక్షణంలో పోతేబాగుండు—కన్నకూతురాయె, ఇల్లాంటి అప్రదిష్టపనులుచేస్తే ఎట్లా చచ్చేది!

రాజ్యం—అదుగో సీతవస్తున్నది. ఏదో కబురుతెస్తున్నది. దాని వాలకంచూస్తేనే తెలుస్తున్నది.

కాంతం—ఇప్పుడు ఇక్కడే ఉండెగదే!

లక్ష్మమ్మ—ఎప్పుడో వెళ్ళింది. పిట్టలాగ కాకపోయినా అది సిసింద్రీలే—ఏమేపీతా?

సీత—అత్తయ్యా అత్తయ్యా సుభద్ర అక్కాను శాంత అక్కానూ రైలుస్టేషను నుంచి ఎవరితోనో మాట్లాడుతూ వస్తున్నారు.

కాంతం—ఎవరితో మాట్లాడుతూ వస్తున్నారే?

రాజ్యం—మొగవాళ్ళా ఆడవాళ్ళా?

సీత—ఏమో ఆడవాళ్ళుకాదు.

లక్ష్మమ్మ—అయితే మొగవాళ్ళే!

కాంతం—అయ్యో నేనెట్లా చచ్చేది, నేను ఎందులోనైనా దూకుతాను.

రాజ్యం—ఉండవమ్మా, మొగవాళ్లుటే అమ్మాయి?

సీత—మొగవాళ్ళు కాదే.

రాజ్యం—మొగవాళ్ళు కాదుటమ్మా.

లక్ష్మమ్మ—మొగావాళ్యాకాక ఆడవాళ్లు కాక ఇంకెవ్వరే!

సీతా—ఏమో నాకు తెలియదు. లంగాలు కట్టు కొన్నారట.

కాంతం—లంగాలు కట్టుకోటం ఏమిటే ?

సీత—ఏమో అంతా అనుకొంటున్నారు.

లక్ష్మమ్మ—గూడకట్టు కట్టుకొన్నారేమో మొగ వాళ్ళు !

రాజ్యం—లేకపోతే ఆడవాళ్లు !

సీత—ఆడవాళ్లుకాదు. చొక్కాలూ కోట్లు వేసు కొన్నారట !

లక్ష్మమ్మ— ఇంకేం— మొగవాళ్ళు— నే నప్పుడే చెప్పాను.

కాంతం—ఈ అప్రదిష్ట నేను పడలేను లక్ష్మమ్మా! నా కేదైనా గొయ్యిచూపించండత్తా.

రాజ్యం—ఉండు ఒదినా తొందర పడతావెందుకూ?

సీత—ఇద్దరూ !

లక్ష్మమ్మ—ఇంకేం దానికొకడు. దీనికొకడు.

కాంతం—మా సుభద్రకు కూడా ఒకణ్ణి అంటగట్టింది కామాలమ్మా ఆ దయ్యం !

సీత—ఆ ఇద్దరూ దొరటోపీలు పెట్టుకొన్నారు.

లక్ష్మమ్మ—ఇంకేం మిలిటరీవాళ్ళు అయిఉంటారు.

కాంతం—మిలిటరీ వాళ్ళైనమ్మా మిలిటరీ వాళ్లు తిరుగుతున్నారట !—అయ్యో సుభద్ర తల్లీ ! నేనేంజేసేది. మీ నాన్నన్నా ఊళ్ళో లేకపోయిరి !

లక్ష్మమ్మ—ఇది మీ అమ్మాయికి పుట్టిన బుద్ధి కాదమ్మా.

రాజ్యం—సుభద్రను నేను చిన్నప్పటినుంచి ఎరుగుదును బంగారుతల్లి !

కాంతం—ఆ మారెమ్మ ఉందిగా దానిపనేఇది.

రాజ్యం—పొట్టిదానికి పుట్టెడు బుద్ధులని, ఊరికే అన్నారు.

లక్ష్మమ్మ—నేనూ అప్పుడే అనుకొన్నాను. ఇది కాపరంచేసే మనిషి కాదని. కాకపోతే ఆ బూడ్సులేమిటి ! ఆ టాకు టీకు లేమిటి ?

కాంతం—ఏంజెయ్యాలె వదినా ?

లక్ష్మమ్మ—సీతా ! నీవు చిన్నదానివి ఫరవాలేదుగాని అట్లా వీధిమలుపుదాకా వెళ్ళిచూసిరా !

రాజ్యం—ఇదేమీ నమ్మేమాటగా లేదే !

లక్ష్మమ్మ—నువ్వు ఏదీ నమ్మవు ! రేపు నీవుకూడా కాంతమ్మతో వెళ్ళు. నీకుకూడా ఒకణ్ణి—!

రాజ్యం—చాల్లె ఊర్కో.

లక్ష్మమ్మ—అదిగో సీత మళ్ళీవస్తున్నదే

కాంతం—ఏమిటే అమ్మాయి ?

సీత—వాళ్ళే. సుభద్ర అక్కయ్యా కాంతక్కయ్యా వస్తున్నారు !

రాజ్యం—ఇటేవస్తున్నారా ?

సీత—ఆ ఇటే.

లక్ష్మమ్మ—వాళ్ళవెంట ఉన్నారా ఆ చచ్చినోళ్ళు?

సీత—ఆ. బుజాలు బుజాలు రాచుకొంటూ నడుస్తున్నారు.

కాంతం ఇటేవస్తున్నారూ!

సీత—ఆ.

లక్ష్మమ్మ—వాళ్ళను ఇంటికి తీసుకురావటం ఎందుకమ్మా అక్కడే వదిలేసిరాక!

రాజ్యం—రానీ. చూద్దాం.

కాంతం—ఏమిటి చూసేది. నీకు ఏమీ ఒళ్లు తెలియటం లేదు.

లక్ష్మమ్మ—రాజ్యానికి కూడా ఇష్టమే వదినా—

కాంతం—ఇంకేం అంతా కలిసి ఊరేగండి నేనుచూడలేనమ్మా ఈ పాపం. నేను ఎందులోనైనా పడతాను!

రాజ్యం—పడుదుగాని ఉండు అత్తా! వాళ్ళను చూచిపడు—

కాంతం—నీకు వేళాకోళంగా ఉందేం?

లక్ష్మమ్మ—చిన్న పిల్లకు ఏంతెలుసు. నవ్వులాటగా ఉంది దానికి.

కాంతం—ఇంతకూ ఇటేవస్తున్నారుటే వాళ్ళు?

సీత—ఇటే వస్తున్నారు అత్తా.

కాంతం—ఎంతదూరానున్నారో చూచిరా కాస్త! మా తల్లికాదూ! నే నెట్లా చచ్చేది వదినా. నేను ఏంజేసిదీ అంటూ! మా సుభద్ర తల్లికి ఎక్కడ దాపురించిం దమ్మా మాయదారి తోడికోడలు.

లక్ష్మమ్మ—ఒక్కొక్కరికి ఒక్కొక్కరు దాపురిస్తారు కర్మం కొద్దీ.

శాంతం—అదిగో ఎవరో రానేవస్తున్నారు. నేను బ్రతకను. నన్ను బావిలో తొయ్యండి.

రాజ్యం—మేము తొయ్యము.

శాంతం—అయితే నేనే పడతా!

రాజ్యం—నిన్ను పడనిస్తామూ ఏమిటత్తా ఇంతనుంది ఉండి.

శాంతం—మరి ఏమిటాగోల!

సీత—అత్తయ్యా, అత్తయ్యా అరుగో. వచ్చారు!

లక్ష్మమ్మ—చీకట్లో కనపడటం లేదు.

రాజ్యం—అదేమిటమ్మా. సుభద్రా—శాంతానూ! ఇద్దరికీ ఇద్దరు మొగాళ్ళు!

శాంతం—నా కళ్లు పోనూ!

రాజ్యం—పోగొట్టు కొందుగానిలే. ఆ కొత్త అల్లుళ్ళను చూచిన తరువాత!

లక్ష్మమ్మ—వచ్చారమ్మా వదినా.

శాంతం—సుభద్రా—(ఏడ్పు) ఏమిటేతల్లి ఈ అప్రదిష్ట ఏమిటి?—పోలాలవెంట వెళ్ళటం ఏమిటి?

సుభద్ర—అల్లాగ స్టేషనుకు వెళ్ళామే!

శాంతం—ఎందుకెళ్ళారే. నా తల్లీ. ఆ దయ్యం తీసి కెళ్ళిందా?

సుభద్ర—తీసికెడితే ఏమే—?

లక్ష్మమ్మ—తీసికెడితే ఏమి అని అడుగుతుందిచూడు పైగా!

రాజ్యం—ఏమమ్మా తీసికెడితే—చెరో మిలిటరీ వాడినీ సంపాదించుకొచ్చారు.

శాంతం—అయ్యో! రాజ్యం నా హృదయం అసలే దహించుకు పోతుందే—అమ్మాయి ఇల్లాంటి మాటలు అన బోకే!

లక్ష్మమ్మ—హాస్యానికి వేళాపాళా ఉండాలె.

రాజ్యం—ఇది వేళేనమ్మా. (విరగబడినవ్వి) భలే పనిచేసింది మా సుభద్ర అక్కయ్య శాంత సరే సరే.— భలే పని చేశారమ్మా ఇద్దరూనూ!

శాంతం—అయ్యో నా తల్లీ ఇంకా ఎందుకు చంపు తావే రాజ్యం!

సుభద్ర—ఏమిటే అమ్మా.ఏమిటా గొడవ?

శాంతమ్మ—ఏమిటండీ పిన్నిగారూ?

శాంతం—పిన్నిగారూ నా బొందగారూనూ! అమ్మాయి సుభద్రా!—మా అమ్మా. ఇటురావే తల్లీ! నీ కెక్కడ దాపురించిందే ఈ తోడికోడలు!

సుభద్ర—ఏమటే అమ్మా ఎందుకూ అట్లాఅంటావూ?

రాజ్యం—(విరగబడినవ్వుతూ)—ఏమిటి అక్కయ్యా మీరు స్టేషనుకు వెళ్ళి—(నవ్వు)

సుభద్ర—వెళ్ళి?

రాజ్యం—వెడితే మిలిటరీవాళ్ళు మీ వెంట బడ్డారుటగా?

సుభద్ర—మిలిటరీవాళ్ళు ఎవరమ్మా ?

రాజ్యం—ఏమోనమ్మా ఊరంతా మోగిపోతున్నది మీరు చెరో మిలిటరీ వాడిని వెంటవేసుకతిరుగుతున్నారని,

శాంతం—ఏమిటే అమ్మా ఈ అప్రదిష్టపు మాట ఎందు కొచ్చిందే ! (ఏడుపు)

సుభద్ర—మిలిటరీ వాళ్లు కాదే అమ్మా.

రాజ్యం—కాకపోవటం ఏమిటిలే. కనపడుతూఉంటే మిలిటరీ వాళ్ళే నమ్మా! మిలిటరీవాళ్ళే ! (నవ్వు) ఇద్దరికీ ఇద్దరు మిలిటరీ వాళ్లు—!

శాంత—ఏమండోయి మీరిద్దరూ ఇల్లాగ రావాలె !

మొదటిమనిషి—ఎందుకే శాంతా !

రెండవమనిషి—ఎందుకే సుభద్రా ?

శాంతం—ఇదేమిటి నా తెలివి తెల్లవార ! మా అల్లుడు లా గుండే—ఈశ్వరరావూ ?

ఈశ్వ—ఏమండీ అత్తగారూ అంతా కులాసాగా ఉన్నారా ?

రాజ్యం—మిలిటరీ వాడమ్మా మీ అల్లుడు కాదు. (నవ్వు)

శాంతం—అదేమిటి నాయినా నువ్వేనా వచ్చింది ?

ఈశ్వ—నేనేనండి !

రాజ్యం—నీ కూతురు మొగుడమ్మా (నవ్వు)

శాంతం— అవునులే. ఎందుకూ నవ్వూ ? మా అన్నయ్య కూడా వచ్చాడా ?

రామా—వచ్చానండి అత్తగారూ!

శాంతం—మంచిది నాయినా మంచిపని చేశారు.

(అంతా విరగబడి నవ్వుతారు)

ఈశ్వ—ఎందుకే సుభద్రా వీళ్ళంతా నవ్వుతారు ?

రామా—ఎందుకే శాంతా ?

రాజ్యం—ఏమీ లేదు అన్నయ్యా మా వదినలు—(విరగబడి నవ్వుతుంది)

ఈశ్వ—ఏమిటమ్మా ?

సుభద్ర—ఏమిటే రాజ్యం ?

రాజ్యం—మిలిటరీవాళ్ళు (నవ్వు) మా వదినలవెంట పడ్డారని (నవ్వు) మేముభయ పడ్డాము. (నవ్వు) అదీసంగతి.

సుభద్ర—అందుకా అమ్మ అంతవాడిలి పోయింది—బాగానే ఉంది!

రాజ్యం—రండర్రా— యశోదమ్మా రా లక్ష్మమ్మ అత్తా రా వెడదాము—వాళ్ళ మొగుళ్ళ వెంట వాళ్ళొస్తే మనమేమో నానా మాటలు అంటిమి—

లక్ష్మమ్మ—నీవేమన్నా అను అల్లాగ అసలుసంధ్య వేళ స్టేషనుకు వెళ్ళటం తప్పేనమ్మా! ఇవ్వాళ మొగుడై నాడు కాబట్టి సరిపోయింది. రేపు ఇంకొకరు అయినా ఇంతే గద.

సీత—వదినలమీద పాటపాడతాను. చాలాతమాషా అయింది.

---

# 2

## భార్యా—భర్త

భర్త—(సంతోషంతో, ఈల వేస్తూ, తలుపు పైన దరువు వేస్తూ) తలుపు తలుపు.

భార్య—(తలుపుతీసి) ఎక్కడికి వెళ్ళారండీ ఇంత ఆలస్యంగా వచ్చారూ ? భోజనంచేసి అప్పుడనగా వెళ్ళితిరి ! గంటసేపాయె ! ఏంజేస్తున్నారు ?

భర్త—(చొక్కా విడుస్తూ సంతోషంతో ఈల వేస్తుంటాడు)

భార్య—ఏమిటూ వికారం ?

భర్త—సంతోషము.

భార్య—ఎందుకూ ?

భర్త— ఎందుకో చెబుతాను. రా మరి !

భార్య—ఇక్కడే ఉన్నానుగా చెప్పండి.

భర్త—అంత దూరాన ఉంటే చెప్పేమాట కాదు అది. దగ్గరకు రావాలె. ఊం. ఇంకా !

చిలకంచు చీరగట్టి
చామంతి పూలుపెట్టి
కిలకిల నవ్వుకొంటూ
కొమ్మరావే నా బంగారు బొమ్మరావే
ఇంద్రకాలి రవికతొడిగి
చంద్రకాంత పూలుపెట్టి
కమ్మాలల్లాడగాను

కొమ్మరావే. నాబంగారు బొమ్మరావె.
కళ్యాణం బొట్టుపెట్టి
వడ్డాణం బిగియగట్టి
సోగా—కన్నులజూస్తూ
కొమ్మరావె నా బంగారుబొమ్మరావె!

భార్య—ఓహోహో! ఇవ్వాళ ఏదో ఉంది!

భర్త— చెపుతా రామరి!

భార్య—అసలు విషయం ఏమిటండీ?

భర్త—దగ్గరకురా.

భార్య—వచ్చాగా! ఇంకా ఏందగ్గరకురాను.

భర్త—రావాలె. భార్యాభర్తలు ఇద్దరూ సరస సల్లాపాలకు సుఖాసీనులై ఉన్నపుడు వారి ఇద్దరిమధ్యా ఎడం మూడు జానలకంటె ఎక్కువ ఉండకూడదూ అనిశాస్త్రం.

భార్య—(నవ్వి)—అబ్బా, ఎంత మంచిశాస్త్రం. ఊఁ—ఇక చెప్పండి ఏమిటి?

భర్త—ఒకసువార్త!

భార్య—ఏమిటా మత్తయిసువార్త!

భర్త—మంచి కబురు, ఆనందకరమైన విషయము.

భార్య—ఏమిటండీ?

భర్త—(జవాబుచెప్పక)—రావే, రావే — సొగసులరాణీ!—నన్నానా, నానానన్నీ (అనిపాడుతూ లేచి అటూఇటూ పచారు చేస్తాడు)

భార్య—ఏమిటండీ, సంతోషం పట్టలేకుండాఉన్నారే!

భర్త—సంతోషం కాదుటే పిచ్చిదానా! ఒక అదృష్ట మనుకో.

భార్య—ఏమిటండీ—చాలా గొడవగా ఉందే!

భర్త—ఇదీ—ఒక—నాటకం.

భార్య—నాటకమైతే బుట్టయ్యపేటహాలులో ఆడండి చూచిన వాళ్ళు సంతోషిస్తారు. నాదగ్గర ఎందుకూ ఆడటం!

భర్త—ఇది నీదగ్గర ఆడవలసిన నాటకం! అందుకని!

భార్య—అయితే అసలు ఇది ఏమినాటకమో మీరు ఏపాత్ర వహించారో తెలియజేయండి.

భర్త—ఇందులో ఇద్దరే పాత్రలు. మొగుడూ—పెళ్ళాం. నీవు మొగుడివి—

భార్య—(విరగబడినవ్వి)—మతిపోతున్నది.

భర్త—అదేలే, నీవు పెళ్ళానివి, నేను మొగుణ్ణి!

భార్య—అయితే ఈనాటకం మీరొక్కరే ఆడతారా, నేను కూడా ఆడాలా!

భర్త—ఆడమనే నేను అనటం!

భార్య—విషయం తెలియందే!

భర్త—విషయం ఏముందీ, భర్త ఒక సంతోష వార్తను తెచ్చి భార్యకు చెబుతున్నాడు. దాని మీద మనము అల్లుకు పోవాలె.

భార్య—ఏమిటా వార్త?

భర్త—అది చెపితే నాటకమే అయిపోతుంది!

భార్య—ఈనాటకం నేను ఆడలేను బాబో ఏమిటో చెప్పుదురూ?

భర్త—పోనీ, నీవు ఆడలేకపోతే నేను ఒక్కణ్ణె ఆడుతాను.

భార్య—చెబుదురూ నన్ను ఏడిపించక.

భర్త—చెబుతాను. అందుకనే దగ్గరకు రమ్మన్నాను ఇప్పుడూ—ఇటు కూర్చో. ఈవైపున—మళ్ళీ దూరంగా కూర్చుంటావు? అంత దూరంగా కూర్చుంటే మొగుడూ పెళ్ళాల నాటకం నడవదు. సరిగ్గా జానెడు ఎడంలో కూర్చోవాలె.

భార్య—ఇందాక మూడుజానలంటిరి!

భర్త—అది కుడివైపుసంగతి. ఎడమవైపున అయితే భార్యా భర్తలమధ్య జానెడు కంటె ఎక్కువ ఎడం ఉండ కూడదు.

భార్య—ఊ చెప్పండి. చెయ్యి వదలండి, ఊ లేచి నుంచున్నా రెందుకూ? నాటకం ఆడతారు కామాలురా బాబూ! అర్ధరాత్రప్పుడు అంకమ్మ సివాలు!

భర్త—కాంతా త్రిలోకసుందరీ, ఇది నాటకమూ కాదు, బూటకమునూకాదు. ఈ కాటకపు రోజులలో మా యధికారికి నాపై దయగలిగి.

భార్య—ఆఁ కలిగి? ఏమైంది చెప్పండి?

భర్త—ఇదంతా నీ అదృష్టమే అనుకో. చేసుకొన్న దానిది కాకపోతే ఇంకెవరిది?

నన్నానానానన్న—నాననన—నన్ననన
నాననా—నన్నానా!
అదృష్టము—కలసివచ్చె
నాననా—నన్నానా.

భార్య—ఏమిటండీ, మీకేపిచ్చి?

భర్త—పిచ్చి కాదోయి, పిచ్చి ఎక్కించే టంతటి సంతోషం.

భార్య—నాకుకూడా చెప్పండి. ఆవిషయం ఏమిటో!

భర్త—చెప్పమంటావా?

భార్య—చెప్పండి, ఎందుకూ దాచటం!

భర్త—మంచిమాట అన్నావు, చెప్పెదను.

అతివా,
అతివా, దాపగనేల
నిన్నువలచి
నీకు
అత్యంత...ఆనందముక
చేకూర్చెడి
నీవిభుడు
(రొమ్ముపై—చెయ్యి వేసికొని చూపుతూ)
వీడేసుమ్మ
బింబాధరా!

భార్య—ఇప్పుడు ఎవరు కాదన్నారండీ! అయినా ఏమిటిది ? మీ సంతోషానికి కారణం ఏమిటీ అని నేను అడిగితే, మీరు ఏమి చెప్పినట్లు ?

భర్త—ఏమి చెప్పాను. చెప్పవలసింది ముందేఉంది.

భార్య— చెప్పండి మరి. ఎంతసేపు వేధస్తారు?

భర్త—(ఈలవేసి నాటక పద్ధతిలో)

ఒక సువార్త చెప్పెద నుజ్వలాంగి
అధిక సంతోషదాయక మద్దినీకు
ఒరుల కెవ్వరికి జెప్పకు మువిద నీవు
అతి రహస్యంబుగా నుంచు మదిని దీని!

హరియా—

కాంత నీ యదృష్టంబు కలిసి వచ్చె,
అధిక ధనలాభవృద్ధి నీకయ్యెచూవె.

భార్య—(నవ్వి) బాగానే ఉంది! ఏమిటీ ఆ ధన లాభం ?

భర్త—ఛా ఛా పాడుచేశావు నాటకంఅంతా! నీవు అట్లా అనకూడదు.

భార్య—మరి ఎట్లా అనాలె ?

భర్త—నీవు కూడా నాటకం ఆడాలె. నాథా! ఆ ధన లాభ మెట్టిదో విన కుతూహలం బయ్యెడిని! అనాలె. చేతనైతే ఒక చిన్న పద్యం కూడా పాడాలె.

భార్య—పద్యాలు నేను పాడలేను బాబూ! మీకు ఇష్టమైతే చెప్పండి. నాకు నిద్రవస్తున్నది. నేను వెళ్ళిపోయి పడుకొంటాను.

భర్త—వెళ్ళితే ఎట్లాగే—వద్దు!......ఉండు.... వద్దు అంటూ ఉంటేనే......

భార్య—ఈ నాటకం ఆడితే నే నుండను. మీ దంతా పిచ్చి వ్యవహారమైంది.

భర్త—ఇల్లాగ కోప్పడితే ఎల్లాగు చెప్పు. మనం ఇద్దరమే ఉన్నాము కాబట్టి, తమాషాకు ఏదో నాటక ధోరణిలో మాట్లాడాను. మరి నీకింత కోపం అయితేఎట్లా? ఏమంటావ్?

భార్య—(నవ్వి) పోనీ ఇప్పుడు చెప్పండి.

భర్త—ఏమీలేదు. మా హెడ్మాస్టరుగారు ఈ నెల ఆఖరునుంచి నాకు జీతంలో ఇరవై రూపాయలు ఇంక్రీమెంటు ఇస్తానన్నారు. సంతోషంగా ఉంది.........నెలకు ఇరవై రూపాయలే. విన్నావా!

భార్య—సంతోషము!

భర్త—సంతోషం అని చప్పగా ఊరుకొంటావేం!

భార్య—ఊరుకోక ఏంజెయ్యమంటారు?

భర్త—నీకు చాలా సంతోషంగా ఉందా! ఓ మాస్తరు సంతోషంగా ఉందా!

భార్య—చాలా సంతోషంగా ఉంది.

భర్త—ఉంటే, మరి ఊరుకొంటావేం!

భార్య—ఏంజెయ్యాలండీ ? ఎగరాలా ?

భర్త—ఎగరవచ్చు. అంటే అది డాన్సు అన్నమాట! లేకపోతే నీకు వచ్చిన నాలుగు కీర్తనలు పాడకూడదూ ? ఏమిచేయకుండా నీవు మెదలకుండా ఊరుకొంటే, నాకు ఎంతో నిరుత్సాహంగా ఉంటుంది.

భార్య—నేనుఎగరనూ లేనూ, డాన్సు చెయ్యనూ లేను!

భర్త—పోనీ ఒక పద్యం అయినా పాడి నీ సంతోషాన్ని తెలియ జేస్తావా?

భార్య—ఊఁహు—(తలతిప్పుతుంది)

భర్త—అయితే పోనీ ఓ మంగళహారతి.

భార్య—మంగళహారతీ లేదు గింగళహారతీ లేదు ఊరుకోండి !

భర్త—ఏమీ వద్దుగాని—పోనీ—నాతో పాటు కలిసి పాడు,

ఇంక్రిమెంటు వచ్చిందీ—వచ్చిందీ
నెలకూఇరవై హెచ్చిందీ—హెచ్చిందీ
మన అదృష్టమూ వుచ్చిందీ—వుచ్చిందీ
దేవుడికి దయా వచ్చిందీ—వచ్చిందీ.
(కీర్తనలాగ పాడును)

నీవు పాడవేం ?

భార్య—నేను పాడను. నాకు ఇంకా అంత పిచ్చి ఎక్కలేదు !

భర్త—ఇంతకూ, ఈఇంక్రీమెంటువలన ఎంతలాభమో నీవు తెలుసుకోలేకుండా ఉన్నావు !

భార్య—తెలుసుకొనేందుకు ఏముందండీ ఇందులో వస్తే గిస్తే నెలకు ఇరవైరూపాయలు.

భర్త—నెలకు ఇరవై అని చప్పరిస్తావు. నెలకుఇరవై అయితే ఏమైందో తెలుసునా ?

భార్య—ఏమైంది ఏమిటి ! రోజుకు పది అణాలు అయింది !

భర్త—ఓసి చెంచలాక్షీ ! అక్కడే నీ తెలివితక్కువ తనం కనబడుతూ ఉన్నది. నెలకు ఇరవై అయితే...సంవత్స రానికి రెండువందల నలభై రూపాయలు అయింది ! ఎంత పెద్ద మొత్తమో ఆలోచించుకో !

భార్య—ఏ నెల వచ్చిన మొత్తం ఆ నెల పులుసులో పడకుండా జాగ్రత్త పెట్టగలిగితే గద ఏమైనా లాభించింది అనుకోటం !

భర్త—అదా నీఅనుమానం ! అయితే నా నిశ్చయం ఏమిటీ అంటే, ఈ ఇరవై ఇల్లాగ బ్యాంకులో పడిపోవలిసిందే! రెండు వేల నాలుగువందలూ కళ్ళ జూడ వలసిందే ! పది ఏళ్ళు కళ్ళు మూసుకొంటేసరి !

భార్య—కళ్ళుమూసుకోటం ఎల్లాగ కనపడుతూ ఉంటే!

భర్త—కనపడుతూ ఉన్నా—కళ్ళు—మూసుకొం దాము ఇల్లాగ (అని భార్యకళ్లు మూస్తాడు)

భార్య—బాగానే ఉంది మీ సరసం! ఉండండి!

భర్త—అదిసరేకాని, భార్యా! ఈ పదేళ్ళు అయిన తరువాత రెండు ఎకరాలపొలం కొనుక్కుందామా! లేక పోతే సొమ్ము చేయించుకొంటావా? చెప్పు! నీకేది కావాలంటే, అదే కొంటాను

భార్య—అయ్యో! అయ్యో! ఆలూ లేదు—చూలూ లేదు, కొడుకుపేరు సోమలింగం అన్నట్లుంది! ఆ డబ్బు మన దగ్గర ఉంటుందిటండీ ఏదో అవసరం రానూవస్తుంది, కర్చు పెట్టనూ పెడతాము!

భర్త—(ఆలోచించి) అయితే ఏంజేయమంటావు? ఉండు—ఉండు ఒక ఉపాయం తోస్తున్నది. చూడూ! ఒక భీమాపాలసీ కొంటాను, నెలకు పది కట్టే పద్ధతిమీద.

భార్య—ఆ కాస్తా తీసికెళ్ళి ఎక్కడో పారేస్తారన్న మాట!

భర్త—ఎక్కడో పారేయటంకాదు. చెవుతా పదేండ్ల పాలసీ తీసుకొని... నెలకు పది చొప్పున కడితే...!

భార్య—(వెక్కిరింతగా)కడితే?

భర్త—వెయ్యిరూపాయలు ఇచ్చేస్తారు!

భార్య—మీరు కట్టింది మీకు ఇస్తారన్నమాట! అవ్వ! ఇంత తెలివి తక్కువతనం ఎక్కడైనా ఉందా!

భర్త—తెలివితక్కువ తనం కాదే పిచ్చిమొద్దూ! ఈలోపున, కర్మంచాలక నేను పోయినా వెయ్యిరూపాయలు ఇచ్చేస్తారు.

భార్య—అవ్వ! నిందుఇంట్లో ఇవ్వేమి మాటలండి!

భర్త—నీకు తెలియదులే ఊరుకో!

భార్య—ఒకవేళ నింజగా ఇంక్రీమెంటు వచ్చినా...

భర్త—(కోపంగా) ఇంకా వస్తే, గిస్తే అంటున్నావ్గా ఎట్లారాకుండా ఉంటుందీ అంటూ! గవర్నమెంటు ఆర్డరు అయింది అందరికి ఇంక్రిమెంటు ఇయ్యమని!

భార్య—సరే—వస్తే!

భర్త—(కోపంగా) మళ్ళీ వస్తే అంటావ్ ?

భార్య—సరేనండి ఒకవేళ వచ్చినా నా మాటవిని, ఆ పైన వచ్చిన డబ్బు నా చేతికియ్యండి. నేను కాస్త మెడ లోకి ఏదైనా చేయించుకొంటాను.

భర్త—రైట్! చెప్పవేం ఆ మాట! పైన వచ్చే డబ్బు ఎట్లా ఖర్చు పెడదామా అని నేను కొట్టుకు చస్తుంటే! ఇంతఎందుకూ ? మూడు నవరసుల గొలుసు ఒకటి కొనుక్కొని వస్తాను నెలకు ఇంత అని ఇచ్చే పద్ధమీాద.

భార్య—ఆపని చెయ్యండి.

భర్త—చూడూ ఒక మంచి చీరకూడా కొనుక్కొస్తే పాపం ఎన్నాళ్ళనుంచో అడుగుతున్నావు!

భార్య—ఇప్పుడు డబ్బు ఏదండీ, ఏది కొంటానికైనా?

భర్త—డబ్బుకేంతక్కువే కాని ఇరవై రూపాయలు ఎక్కువవస్తుంటే! అయితే పట్టుచీర తెమ్మంటావా ?

భార్య—ఏదోఒకటి.........కానీయండి. గొలుసు తెస్తానంటిరే! దానికేం ఇస్తారు ?

భ_ర్త—ఏం? గొలుసు బాకీక్రింద నెలకు పది. చీర బాకీక్రింద అయిదు. తెలిసిందా? ఇంకా అయిదు మిగులు తయి.

భార్య—ఆ అయిదూ నా చేతికియ్యండి.

భ_ర్త—అఁహా. ఆ అయిదూ నా చేతిలో ఉండ నియ్యండి!

భార్య—ఎందుకూ సిగిరెట్లకూ వాటికీ తగలెయ్య టానికా!

భ_ర్త—(కోపంగా) నాకు కావాలె.

భార్య—ఎందుకండి ఎంత ఉంటే అంతా పాడుజేస్తారు!

భ_ర్త—నేను వట్టి తెలివితక్కువ వాడిని అని నీ అనుమానంకదూ?

భార్య—(నవ్వుతూ) నాకేమీ అనుమానం లేదండీ!

భ_ర్త—నేను ఇవ్వను. కోపంగా) కాకపోయినా ప్రతి దానికీ నీ ఆజ్ఞ అయిపోయింది. ఆ అయిదూ నీ కివ్వను. నా యిష్టం వచ్చినట్లు వాడుకొంటాను.

భార్య—సరే ఏంజేస్తాము. కానియ్యండి (వెళ్ళి పోతుంది మూతిముడుచుకొని)

---

## రెండవ రంగము

(మరునాడు ప్రొద్దున తొమ్మిదిగంటలకు. భ_ర్త ఒకమూట తీసుకొని సంతోషంతో వస్తాడు)

భ_ర్త—ఏమ్...ఎక్కడున్నావు! రాచప్పున!

భార్య—ఏమిటండీ. ఏమిటండీ ఆ కాయితం! ఏదో తమాషాగే ఉందే! ఏమిటది?

భార్య—ఇది ఇన్స్యూరెన్సు పాలసీ నెలకు అయిదు రూపాయలు కట్టాలె.

భార్య—ఎంతకు ఇన్స్యూరు చేశారు!

భర్త—వెయ్యిరూపాయలకు.

భార్య—సరే. బాగానే ఉంది. ఏదో బట్టలు కొన్నట్టున్నారే?

భర్త—చూడవే. చూడు ఎంత తమాషాచేశానో!

ఇదిచూడవే—ఇంతిరో
ఇంతిరో—మేల్ బంతిరో
కాంతుడూ తెచ్చిన—ఘనమైన కానుక
ఇదిచూడవే
ఇంతిరో
ఇదిచూచి నను మెచ్చి
కోరిన వరము లిచ్చి
గ్రుచ్చి కౌగిట చేర్చవే
ఇంతిరో మేల్ బంతిరో
ఇదిచూడవే.

భార్య—(భర్త నోరు గట్టిగా, అరచేత్తో మూసి) ఏమిటో చూడనియ్యండి!

భార్య—ఇదియొక చీర! జరీచీర? ఎంతకుకొన్నారూ?

భర్త—(గర్వంగా) ముప్పైరెండు !

భార్య—ఆ పొట్లాలేమిటి ?

భర్త—(ఒక్కగుక్కలో) ఇది జిలేబీ ! ఇది మైసూరు పాక్ ! ఇది పకోడీ ! ఇది కోవా !

భార్య—వీటి అన్నింటికి డబ్బు ఎక్కడి దండి ? అదేమిటి జేబులో నుంచి తీస్తున్నారు ? ఏమిటది. గొలుసే ! కొన్నారూ ?

భర్త—ఓ మూడునవరసులు.

భార్య—ఇవన్నీ అప్పుజేసే ?

భర్త—ఓ ఢంకా మీద దెబ్బకొట్టి !

భార్య—అప్పు ఎవరిచ్చారండి ?

భర్త—ఒకరని ఏమిటి, ఎవరు బడితే వాళ్ళే ఇస్తారు. జీతం, నెలకు ఇరవై రూపాయలు ఎక్కువ వస్తుంటే, ఎవరు ఇవ్వరూ అంటా !

భార్య—పోనీలెండి. చీరా గొలుసూ వచ్చినయి. మంచిపని చేశారు. నెలకు ఎంత ఇస్తానన్నారూ ?

భర్త—గొలుసు బాకీక్రింద నెలకు పది, చీర బాకీక్రింద పది. భీమాకు నెలకు అయిదు.

భార్య—అదేమిటండి అంతా కలిసి ఇరవై అయిదు అయింది.

భర్త—(ఆశ్చర్యంతో) ఆఁ...ఇరవై అయిదా పది, పది, ఇరవైన్నీ......

భార్య—అయిదున్నా...

భర్త—సరేలే. ముందుచీర గట్టుకో, తరువాత సంగతి నేను చూస్తాను.

భార్య—ఇప్పుడెందుకండీ! రేపు దీపావళి పండుగకు కట్టుకొంటాను.

భర్త—కాదు. ఇప్పుడు కట్టుకో నేను చూస్తాను.

సరిగంచు—చీరగట్టి
చేమంతి—పూలుపెట్టి
కులుకు నడకల—రావే—

---

## మూడవ రంగము

### సమయము—నెలాఖరుకు

భార్య—ఇన్స్యురెన్సు కంపెనీనుండి ఏదో కాయితం వచ్చిందండీ!

భర్త—(విచారంగా వచ్చిందీ—ఏదీ—అదె! ఈనెల ప్రిమియం కట్టాలె — ఛీ — వెధవ తద్దినం తెచ్చి పెట్టుకొన్నాను.

భార్య—పోనీ మానెయ్యండి.

భర్త—(విసుగుతో) మానేయటానికి వీలులేకుండా వచ్చింది. కర్మం...మానేస్తే...ఇదివరలో కట్టిన యాభై రూపాయలు దండుగ అయిపోతవి. ఎవరో పిలుస్తున్నట్టున్నారు చూడు!

భార్య—(వీధితలుపు తీసిచూచి, మళ్ళీవచ్చి) బట్టల కొట్టు గుమాస్తా అండీ.

గుమాస్తా—నేనేనండి పంతులుగారూ. మీరు తెచ్చిన చీరబాపతు ముప్ఫైరూపాయలూ నెలకు పదిచొప్పున ఇస్తానని ఒప్పుకొన్నారటగా. ఈ నెలపదీ వసూలు చేసుకొని రమ్మన్నారండీ!

భర్త—ఎల్లాగ? తెలివితక్కువపని చేశాను. ఆ చీర మళ్ళీ ఇద్దామన్నా వీలులేక వచ్చె! కట్టుకొంటివి!

భార్య—మీరే కట్టుకోమన్నారు! నేను వద్దండీ అంటే వినకపోతిరి!

భర్త—అన్నానే! నాదేతప్పు! అతన్ని ఎల్లాగో పంపు.

భార్య—ఇస్తారు వెళ్ళవయ్యా. రేపో ఎల్లుండో తెచ్చి ఇస్తారు.

భర్త—వెళ్ళాడూ! అమ్మయ్యా! ఎట్లా ఇచ్చేది!

భార్య—ఏం? ఇంక్రిమెంటు వస్తుందంటిరిగా?

భర్త—నా బొంద! అదిరాలేదు.

భార్య—ఎందుకు రాలేదండీ? గవర్నమెంటు ఆర్డరు ఇచ్చారంటిరే!

భర్త—(విసుగ్గా) ఇచ్చారే! ఇచ్చినమాట నిజమే! గవర్నమెంటువారు పత్రికలలోకూడా వేశారు. కాని తీరా జూస్తే అది మాస్టర్లకు వర్తించదట!

భార్య—ఏం?

భర్త—నా ఖర్మం! మాస్టర్ల ఖర్మం!

భార్య—ఇప్పుడెల్లాగు?

భర్త—చచ్చినట్లు అప్పులన్నీ తీర్చుకోవాలె.
(తలుపుగొట్టిన శబ్దం)
ఎవరోచూడూ !

భార్య—నగలవర్తకుడు, గుమాస్తాను పంపాడు.

భర్త—ఎందుకో ?

భార్య—ఎందుకేమిటి గొలుసు బాపతు నెలకు పది ఇయ్యాలెగా !

భర్త—(రహస్యంగా) ఊరికి వెళ్ళారని చెప్పు.

భార్య—(పెద్దగా) ఊరికెళ్ళారయ్యా.

గుమాస్తా—ఎప్పుడొస్తారమ్మా.

భార్య— (భర్తతో రహస్యంగా) ఎప్పుడొస్తారని చెప్పేదండి ?

భర్త—(రహస్యంగా) ఇప్పట్లో రారని చెప్పు.

భార్య—(భర్తతో రహస్యంగా అదెట్లాగండీ.

భర్త—(రహస్యంగా) చెప్పవే నీకుపుణ్యంఉంటుంది. చెప్పు.

భార్య—(పెద్దగా) ఇప్పట్లో రారయ్యా.

గుమాస్తా—పోనీలెండి. ఎప్పుడొస్తారో చెప్పండి ?

భర్త—(భార్యతో రహస్యంగా) వీడి దుంపతెగ! వదలడే ! మళ్ళీవస్తాడు—ఓపని చెయ్యి అసలు రారనిచెప్పు ఊ. చెప్పు. దబ్బున చెప్పు.

భార్య—(పెద్దగా) అసలు రారయ్యా. (విరగబడి నవ్వుతుంది)

# 3

## మొదటి రంగము

### పంతులు—కాంతం

పంతులు—కాంతం కాంతం వచ్చాను.

కాంతం—అప్పుడే బండి వచ్చిందా ఏమిటండీ! ...సునుంచేనా రావటం ?

పంతులు—ఆ.

కాంతం—అప్పుడే ఎల్లాగ వచ్చారండి ? శనివారం ...ంత్రమేగా వెళ్ళింది. సోమవారం ప్రొద్దుటి కల్లా రానే ...!

పం—మరిరైలు అంటే ఏమిటనుకొన్నావు ? అదే ...పా!

కాం—సరే బాగానేఉంది. కాళ్ళుకడుక్కోండి ఎం... స్నానంచెయ్యండి వేడినీళ్ళుసిద్ధంగాఉన్నయి. అదిసరే ...దవసం తీసుకు రాలేదేమండి ? మరిచిపోయినారా ?

పం—మరిచిపోతానా ఏమిటి ? నీవు అన్నిసార్లు చెప్పా...గా! అసలు నీవుఒకసారి చెబితేనేమరిచిపోను. అన్నిసార్లు ...తే ఎల్లా మరిచిపో తాననుకొన్నావు?

కాం—మరి ఎందుకు తీసుకు రాలేదండి ?

పం—ఎందుకు తీసుకు రాలేదంటే——దానికి అనేక ...ణాలున్నై.

కాం.—ఒక్కటి చెబుతారూ ?

పం.—ఏమిటంటే—ఎక్కడైనా దొరకటం లేదు.

కాం.—అబద్ధం చెప్పినా కాస్త అతికేలాగున చెప్పాలి. దవనం దొరకటం లేదూ అంటే ఎవరు నమ్ముతారండీ ?

పం.—ఎవ్వరూ నమ్మరంటావా ?

కాం.—ఎవరూ నమ్మరు.

పం.—పోనీ ఏమని చెప్తే అందరూ నమ్ముతారో చెప్పు? ఓసారు తెలుసుకొంటే మంచిది.

కాం.—ఎందుకు తేలేదు అంటే—అబద్ధాలు ఆడాలటండీ ?

పం.—సరి నేను నిజం చెపితే నమ్మకపోతే ఏంజెయ్యాలె.

కాం.—దవనం దొరక్కపోవటం నిజమే నంటారూ ?

పం.—నిజం. సత్యం !

కాం.—అదేమి విచిత్రం అండీ ! మద్రాసులో దవనం దొరక్కపోవటం !

పం.—మద్రాసు ఏమిటి అసలు ఈ రాజధానిలో ఎక్కడా దొరక్కుండా పోయిందేమోనని నాకు అనుమానంగా ఉంది !

కాం.—ఎక్కడా దొరకలేదండి ?

పం.—ఎక్కడా—మద్రాసు అంతా తిరిగాను ఎక్కడైనా కాస్త దొరకుతుందేమోనని !

కాం.—మనభాగ్యం లెండి. మనకు ఏది కావాలన్నా అంతే పాలకొల్లు వెళ్ళినప్పుడు పనసకాయ తెమ్మంటే దొరక

లేదన్నారు. విశాఖపట్టణంలో ఒక్క అనాసకాయ అయినా దొరక లేదుమీకు! గుంటూరులో గోంగూరా దొరక లేదు మీకు! మీకేదీదొరకదు అదేంకర్మమో!

పం—అయితే నా మాట అబద్ధం అంటావా ?

కాం—అబద్ధం కాకపోతే దవనం దొరక్కపోవటం ఏమిటి చెప్పండి ?

పం—ఎందుకు దొరక లేదో చెప్పమంటావా ? అట్లా అడుగు చెబుతాను. స్నానానికి నీళ్ళు తోడావా ? స్నానం చేస్తూ చెబుతాను. ఏమైందీఅంటే మద్రాసులో దవనం అమ్మే కొట్లు ఎన్ని ఉన్నయ్యో అన్నికూడా...అసలు ఎన్ని ఉన్నయ్యో తెలుసునా ?

కాం— తెలియదు.

పం—పోనీ అసలు, దవనం ఎక్కడ అమ్ముతారో తెలుసునా ?

కాం— తెలియదు.

పం—(విసుగ్గా) మరి నీకేమీ తెలియదుకదా మరి నే నెట్లా చెప్పేది ?

పం—బాగుంది మీరు అనటం! దవనం ఎక్కడ అమ్మేదీ తెలియక పోతే ఏం ? ఎందుకు దొరక లేదో చెప్ప కూడదా ?

పం—ఎట్లా చెపటం—మద్రాసు ప్రభుత్వం నడుపు తున్న ప్రధానమంత్రి ఎవరో తెలుసునా ?

కాం—తెలియదు. నాకేం తెలుస్తుదండీ?

పం—పోని కార్పొరేషన్‌లో మేయర్ ఎవరో తెలుసా?

కాం—ఏమిటో. ఆ గొడవ అంతా నాకేం తెలుస్త దండీ! అయినా దవనానికి ప్రధానమంత్రికీ సంబంధం ఏమిటీ అంటా?

పం—(నవ్వి) నీకు తెలియదే—నీవో వెర్రిబాగుల దానివి. బోలెడు. అంత సంబంధముంది. ఒక్కొక్క మనిషి ప్రధానమంత్రి అయితే బజారునిండా దవనమే! ఒక్కొక్కరు వస్తే, దవనం మాయమూ అవుతుంది.

కాం—అదేమిటండి, దవనానికి మంత్రిత్వానికి ముడేస్తారు—? నన్ను...

ప.—కాదు కాదు. ఆ సంబంధం ఏమిటో చెప్పమంటే చెబుతాను. ఏమిటీ...అంటే ఇప్పుడున్న మంత్రిగారి భార్యకు బట్టతల. పూలూ దవనం పెట్టుకోంటానికి ఆమె నోచుకోలేదు. అందుకని విచార సూచకంగా, దవనం కొట్లూ, పూలు అమ్మే కొట్లూ, అన్నీ కూడా సంవత్సరానికి ఓరోజు కట్టేస్తారట. కర్మంజాలక నేను వెళ్ళినరోజునే వాళ్ళు ఆ కొట్లు కట్టేశారు.

కాం—చాల్లే ఊరుకోండి!

పం—సరె పోనీనమ్మకపోతే. దవనమేమిటి దువ్వెనలు, పిన్నులు, నూనెలు, సబ్బులు సహా స్త్రీ దొరక్కుండా పోతయ్యే మాస్తుండు!

కాం—అల్లాగే ఉంది చూస్తే ఎందుచేతనంటారు?

పం—అనేక రాజకీయ కారణాలున్నాయి. ఒక్కసంగతి చూడకూడదూ. వీసె, అర్ధరూపాయి ఆరు అణాలకు వొచ్చే మెరపకాయలు అయిదు రూపాయలు ఎందుకు కావాలె చెబుదూ ?

కాం—అవును మరి !

పం—మరిఇంకేం, ఇదీ అంతే ననుకో.

కాం—సరే పోనీలెండి. బెజవాడలో దిగి మా అక్కయ్యగారింటికి వెళ్ళివచ్చారా ?

పం—వెళ్ళివచ్చారా అని అడుగుతున్నావూ !! ఎందుకు వెళ్ళనూ ! అసలు నీకు ఆ అనుమానం ఎందుకు వచ్చిందీ అంటా ?

కాం—సరేలెండి. వెళ్ళొచ్చారుగదా. సంతోషము మా బావ కనుపించాడా ?

పం—ఆ, ఆ.

కాం—కులాసాగా ఉన్నాడా ?

పం—కులాసాగాక ఆయనకేం ?

కాం—ఎప్పుడు కనిపించాడు ?

పం—ఎప్పుడేమిటి! నేనువెళ్ళేసరికి ఇంట్లోనేఉన్నాడు.

కాం—అంటే శనివారం రాత్రిఅన్నమాట! అంతేనా?

పం—అవును ఏమిటి అల్లాగ నిక్కదీసి అడుగుతావు?

కాం—అంహా—ఆ రోజు రాత్రి ఆయన అబ్బాయికి ఊవూళ్ళో కనిపించాడట. ఇంటికిరా పెదనాన్నా అంటే ఏదో

అర్జంటు పనిమీద వచ్చాను. ఈ రాత్రి వకీలును కలుసుకోవాలె రానని చెప్పాడట మరి మీకు బెజవాడలో ఎల్లాగ కనిపించాడూ అని నా సందేహం.

పం—ఏమోమరి !

కాం—ఏమోమరి ఏమిటండీ. ఆ రోజు ఇక్కడుండెగదా, మీకు ఎల్లాగ కనుపించాడూ అంటూ ?

పం—ఎట్లా కనుపించాడోమరి నాకూ ఆశ్చర్యంగానే ఉంది. అయినా మీ వాళ్లు అదోరకం మనుష్యులు ఎక్కడబడితే అక్కడ కనిపిస్తూ ఉంటారు. ఒకనీతీ, నియమం ఉండేగా !—ఛీ ఛీ—బందరులో, వాళ్ళకు, కనిపించాముగదా, మళ్ళీ ఆ రోజునే, ఆ సమయాన్నే, బెజవాడలో కూడా కనిపించకూడదూ అని తెలియక పోయె. మరి ఏంజేసేది !

కాం—అబ్బ మీ హాస్యానికేం గాని చెబుదురూ వెళ్లారాలేదా ?

పం—వెళ్లాను.

కాం—మా బావ ఎట్లా కనుపిస్తాడూ ?

పం—కనపడలేదే—ఊరికే అన్నాను. అయితే ఒకటి మా వదినగారితో ఎవరో మాట్లాడతూ ఉంటే మీ బావే గదా అనుకొన్నాను.

కాం—చాల్లెండి మీ సరసాలు మా అక్కయ్యగారింటికి వెళ్ళనేలేదా ఇంతకూ ?

పం—వెళ్ళానే, వె...ళ్ళా...ను.

కాం—మా అక్కయ్య ఇట్లో ఉందా ?

పం—ఉండక ఎక్కడికి వెళ్ళుతుంది?

కాం—అంహ ఉందా అని అడిగాను. అంతే. అయితే అక్కడే భోజనం చేశారా ?

పం—అహ అక్కడ చెయ్యలేదు. హోటలులో భోజనంచేశాను.

కాం—ఎందుచేతనండి ? అక్కడే భోజనం చేయక పోయినారా ?

పం—ఏమిటో ఆ రాత్రివేళ. వాళ్ళను కష్టపెట్టటం ఎందుకు అనిపించింది. అదీకాక మీా అక్కయ్య వంట్లో సుఖ ముగా ఉన్నట్టులేదు !

కాం—ఏం ? ఏంచేతా ?

పం—మళ్ళీ అయిదోనెల వచ్చిందనుకొంటాను.

కాం—చాల్లెండి. ఇహ ఊరుకోండి ఎవరైనా వింటే నవ్వుతారు !

పం—ఎవ్వరూ వినటంలేదు. అయినా ఎందుకూ నవ్వటం ?

కాం—ఎడపిల్లకు ఇంకా మూడో నెల వెళ్ళ లేదుగదా, అప్పుడే అయిదోనెల రావటం ఏమిటండీ ?

పం—ఆ విషయం తెలుసునో తెలియదో మీా అక్కయ్యకు ?

కాం—(నవ్వి) మహాబాగా ఉంది మీారనటం ఆ విడకు తెలియకపోవటమేమిటి అర్థంలేని మాటలు !

పం—అయినా మీ అక్కయ్యకు ఇల్లాంటి పట్టింపులు లేవు. చటుక్కున ఉండి పోవటమే ఆమెస్వభావం!

కాం—ఇక మీ కవిత్వాలు కట్టిపెట్టండిగాని అయితే .........'

పం—అదిసరేగాని కాంతం, మాట వచ్చిందికాబట్టి జ్ఞాపకం వచ్చింది...మరీ...'

కాం—ఏమిటండీ ?

పం—మీ అక్కయ్య అడిగిందే!

కాం—ఏమడిగిందండీ ?

పం—ఏదో, తమాషాగా, మా చెల్లెలు...ఏదో అన్నదే...జ్ఞాపకం రావటంలేదు. అసలు ఏమైనా జరిగిందా ఏమిటి ? అంటే. "నివేమన్నా మళ్ళీ"—?

కాం—(చిరునవ్వుసిగ్గు) చాలు, చాలు. ఇక ఊరు కోండి.

పం—అదికాదే !

కాం—(నోరుమూసుకొని) అవ్వ! ఇక ఊరుకో మన్నానా! ఊ—సరిగాని. అయితే మీరు హోటలుకు పోతుంటే మా అక్కయ్య ఊరుకొన్నదండీ!

పం—ఊరుకొన్నదీ—ఏదో అయితే నేను వినిపిం చుకో లేదు చెప్పన్నూ గబగబ వచ్చేశాను.

కాం—మహాగొప్పపని చేశారు. సరేకాని అంతా బాగున్నారా?

పం—అంతాకులాసాగా ఉన్నారు.

కాం—మరిచిపోయినా పసివాడికి ఎట్లా ఉందో కనుక్కున్నారా ?

పం—వాడికేం కులాసాగానే ఉండి ఉంటాడు.

కాం—అదేమిటండి వాడికి జ్వరం వస్తున్నదిగా !

పం—అదెవ్వరు చెప్పారేవ్ ?

కాం—ఎవ్వరు చెప్పటం ఏమిటండి మొన్ననేగా ఉత్తరం వచ్చింది !

పం—అవునవును నాకు ఆ సంగతి జ్ఞాపకం లేదు సుమీ !

కాం—ఎందుకు జ్ఞాపకం ఉంటుంది లెండి. పోనీ మా అక్కయ్య అయినా చెప్పలేదేమిటండీ ?

పం—నేను ఆ సంగతి అడగనూలేదు. ఆమె చెప్పనూ లేదు.

కాం—మీరు ఎందుకు అడుగుతారూ ! మీరు అడిగారేమోనని అనుకోటం తప్పైనాది గాని, పోనీ ముసలమ్మకేమైనా కులాసాగా ఉన్నట్లు తెలిసిందా ?

పం—ఆఁ ఆ ముసలమ్మ కులాసాగానే ఉంది.

కాం—మా అక్కయ్య చెప్పిందా ?

పం—చెప్పటం ఎందుకూ ఆమె కులాసాగా ఉన్నట్లు తెలుస్తునే ఉంటే !

కా—ఎట్లా ?

పం—అక్కడే ఉందిగా !

కాం—ఎక్కడ ?

పం—అక్కడే వసారాలో పడుకొని ఉంది !

కాం—అయ్యో కర్మమా మీరు ఇంతకూ వెళ్ళినట్టు లేదే !

పం—నీకు అట్లాగే ఉంటుంది. నేను వెళ్ళినా వెళ్ళనట్లే ఉంటుంది నీకు అది నా కర్మం ఏంజేస్తాను.

కాం—మరి మీరు అనేమాటలు ఎల్లాగున్నయ్యండీ! ముసలమ్మ మా అన్నయ్య దగ్గరకు నెల్లూరు వెళ్ళిందని నిన్ననేగా సుందరమ్మ చెప్పింది.

పం—మరి ఆ సంగతి నాకేం తెలుసు !

కాం—తెలియకపోబట్టి, చూశానని కులాసా ఉందనీ అబద్ధం ఆడుతున్నారన్నమాట !

పం—నేనేమీ అబద్ధం ఆడటంలేదు తెలిసిందా ? అక్కడ ఎవరోపడుకొని ఉంటే మీ అమ్మే అనుకొన్నాను. అంతా మీ అమ్మ పడుకొన్నట్లే ముడుచుకు పడుకొన్నది. మీరు అట్లాగే అనుకొంటారు. ఆపేక్ష లుంటేగా !

పం—నీవు అల్లాగ అనుకొంటే నేనేంజేసేదిమరి !

కాం—ఎందుకులెండి మీరు వెళ్ళలేదు అన్నమాట

పం—వెళ్ళానయ్యా మహాప్రభో ! వెళ్ళాను !

కాం—సరేగాని ఇదిచెప్పండి ! మీరు వెళ్ళినరోజున మన బందరు బండీ బెజవాడకు ఆలస్యంగా వెళ్ళిందట. మీరు ఈ బండిదిగి పరుగెత్తుకుంటూ వెళ్ళి మద్రాసు మెయిల్

ఎక్కారట. ఈ సంగతంతా మన రాధ చెప్పాడు—నాకు ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది. నిజమేనా ఈసంగతి ?

పం—నిజమే!

కాం—మీరు బందరు బండీ దిగిన తరువాత గంట న్నర టైము ఉంటుంది. మీ వాళ్ళ ఇంటికి వెళ్ళివస్తాను అన్నారుగదా! మరి ఈ బండీ దిగి ఆ బండి ఎక్కితే మా అక్కయ్యగారి ఇంటికి వెళ్ళింది ఎప్పుడండీ ?

పం—...............

కాం—మాట్లాడరేం ? ఎందుకండీ అబద్ధాలు! సరే ఇంకెందుకులెండి మీరు వెళ్ళలేదని తేలిపోయింది!

పం—అబ్బ! తెలివిగలదానివి ఎట్లాగయితేనేం కని పెట్టావు! నేను ఆ రాత్రే మీవాళ్ళ ఇంటికి వెళ్ళానని చెప్పానా ?

కాం—మరి ఎప్పుడు వెళ్ళారు!

పం—ఓసి, పిచ్చిమొద్దూ, నేను...మద్రాసునుంచి వచ్చేటప్పుడు...బెజవాడలో ఆగి మీ అక్కయ్య గారింటికి వెళ్ళి చూచివచ్చాను.

కాం—వచ్చేటప్పుడు ఎట్లా దిగారండి ? శనివారం రాత్రి మెయిల్ ఎక్కారా ?

పం—అవును. ఆదివారం మద్రాసులో పని చూచు కొన్నాను.

కాం—ఆదివారం రాత్రే మళ్ళీ మెయిల్ ఎక్కారన్న మాటేగా ?

పం—అవును.

కాం—అబ్బబ్బ. ఎందుకండీ ఇంకా వాదన. మద్రాసులో ఆదివారం మెయిల్ ఎక్కితిరి. సోమవారం ప్రొద్దిటికల్లా రానే వస్తిరి! మీరు బెజవాడలో దిగిందెప్పుడూ, అన్నీ అబద్ధాలేగద!

పం—చాల్లే ఊరుకో అబద్ధాలంటావు! చెపుతా విను. ఆదివారం తెల్లవారుఝామున నాలుగింటికి వస్తుంది బెజవాడకు మెయిల్ తెలుసునా? (కోపంగా)

కాం—వస్తే?

పం—అయిదున్నరకు బందరు బండి బెజవాడలో బయలుదేరటం!!

కా—అయితే?

పం—ఆఁ అయితే—గంటన్నర టైముఉంది దానికీ దీనికీమధ్య. మీ అక్కయ్యగారింటికి వెళ్ళిరావటానికి ఆ టైము చాలదాఏమిటి?

కా—సరేలెండి.

పం—తెలివి! తెలివని! నేనేదో అబద్ధాలాడుతున్నానని, పట్టుకోవచ్చింది. ఇప్పుడు అయిందా! తెలివిగలదానివి బయలుదేరి వచ్చావు! మహాలావు!

కాం—సరే. నా తెలివికేం కానీండి. ఒక్కసంగతి చెప్పండి, మీరు మా అక్కయ్యగారి ఇంటికి వెళ్ళారు. సరే. అయితే హోటల్లో భోజనం చేసిందెప్పుడూ ఆ తెల్లవారు ఝామునేనా?

పం—అబ్బబ్బ! వెధవప్రశ్నలన్నీ అడుగుతావు. ఇందు కున్నయి తెలివితేటలు !

కాం—అఁహా. అదికాదు (నవ్వి) మా వాళ్ళఇంటికి ఎప్పుడు వెళ్లారండీ ! ఆ తెల్లవారుఝామున మీకు ఏహోట లులో అన్నంపెట్టారూ ! చెప్పరేం ? ఊఁ చెప్పండి ?

పం—చాల్లే ! ఎప్పుడు వెళ్లానో జ్ఞాపకంలేదు. ఎవరికి జ్ఞాపకం ఉంటవి ఈ సంగతులన్నీ !

కాం—రండి, రండి, వడ్డించాను. ప్రయాణ బడలిక వల్ల పైత్యాన బడ్డట్టున్నారు !

పం—పోవో తొందరగా కానీ వస్తున్నా !

—

# 4

## మొదటి రంగము

సుందరమ్మగారిఇల్లు వీధిగది.

సీతమ్మ—సూరమ్మ—సుందరమ్మ

సుందరమ్మ—రావేసీతా. ఏమిటేసీతా ఇంత ఆలస్యంగా రావటం! నాటకం చూద్దామని సరదాఅన్నా లేదా ఏమిటే సీతా?

సీత—లేకపోవటం ఏం అత్తయ్యా! వచ్చాగా! పెందలాడే వద్దామంటే పని తెమలందే! అది సరేగాని అత్తయ్యా అంతా వచ్చారా?

సుం—ఇంకా ఎవరు రావాలమ్మా! అంతావచ్చారు.

సూరమ్మ—(ప్రవేశిస్తూ) ఎందుకురారు వదినా నాటకం చూడటం అంటే అందరికీ సరదాయే నాయె!

సుం—వచ్చావు వదినా నీమాటే అనుకుంటున్నానురా!

సూరమ్మ—అందరు ఏరి వదినా?

సుం—ఇక్కడెందు కుంటారమ్మా?

సీత—ఎక్కడ నాటకం ఆడటం?

సుం—నీవు ఇంకా చూడ నే లేదు అన్నమాట! దొడ్లో స్టేజీ—పందిరీ అన్నిఏర్పాట్లు ఉన్నాయి మీరుకూడా అక్కడికి వెళ్ళండి అందరూ అక్కడే ఉన్నారు.

సీత—నీవు రావూ?

సూరమ్మ—ఆమె ఎల్లావస్తుందే సీతా నీ దంతాపిచ్చి ముత్తుకోళ్ళు కాకపోతే! ఆమొగారు ఇక్కడుండి ఎవరైనా వస్తే లోపలికి పంపొద్దూ!

సుం—ఇంకెవ్వరూ రావలసిన వాళ్ళు లేరు గాని వదినా......'

సీత—మరి ఇంకేం, రా రాదు అత్తయ్యా?

సుం—మొగుడు వేషం వేసే ఆమొగారు ఇంకా రాలేదు. ఆమెకోసం చూస్తున్నానే సీతా!

సీత—(నవ్వి) ఎవరి మొగుడు అత్తయ్యా?

సుం—ఎవరి మొగుడా (నవ్వి) పెళ్ళానికి మొగుడు.

సూరమ్మ—బాగానేఉంది. అసలు ఏంనాటకమట్టాఇది?

సుం—ఏంనాటకమో నాకూ సరిగ్గా తెలియదు.

సూరమ్మ—నీకు తెలియక పోవటమేమిటి వదినా అంతా నువ్వేగా ఏర్పాటుచేస్తున్నది?

సుం—పోనీ ఏంనాటకమో చూడరాదట్టా తెలుస్తుంది.

సూరమ్మ—ఏంనాటకమో చెప్పందే ఎల్లాగ చూస్తా రమ్మా! నీ దంతా విచిత్రం కాకపోతే!

సీత—(నవ్వి) అంత చెప్పకూడని నాటకం కామాలు! ఏం, అత్తా?

సుం—అదికాదే. సీతా అదీ, మొగుడూ పెళ్ళాం, నాటకంట!

సీత—మొగుడూ పెళ్లాం నాటకం ఏమిటి అత్తయ్యా! మొగుడూ, (నవ్వు) పెళ్లాం నాటకమా! ఇదేం నాటకం (నవ్వి) మొగుడూ, పెళ్లాం. భలే భలే!

సూరమ్మ—ఓ హరిశ్చంద్ర నాటకమా, ఓ చిత్ర నళీయమూ, ఇదేమి ఓ సీతా, ఎక్కడా విన లేదు. మొగుడూ పెళ్లాం నాటకం ఏమిటే! మొగుడూ పెళ్లాం అయితే వేరే విడిగా నాటకం ఎందుకట్టా? రోజూ ఉండే నాటకమేగా!

సీత—పోనీ అదేమిటో చూద్దాం రా అత్తయ్యా!

సూరమ్మ—వస్తాలే అందుకు కాదు. ఇదేమిటీ అంటా!

సుం—ఏదీ? ఇక్కడున్నట్టేఉంది మాయమైందే!

సీత—ఆవిడకు బోలెడు పనులాయె! రా అత్తా వెడదాము.

సూరమ్మ—ఇప్పటినుంచే ఎందుకే ఆ గోల లో! ఇంకా ఎవరో రాలేదన్నదిగా సుందరమ్మ!

సీత—ఇంకా రాకుండా ఉంటుందా ఏమిటి! వచ్చే ఉంటుంది. రా అత్తా రా. అదిగో గంట కొడుతున్నారు. తెర ఎత్తారు కాబోలు! (గంట)

సూరమ్మ—సరే. ఇదేమి నాటకమో చూద్దాము రా

---

## రెండవ రంగము

### స్థలం స్టేజీకి ముందు

[సుందరమ్మగారి దొడ్లో పాక, స్టేజీఏర్పాటు అయింది. ఒక్క తెరమాత్రం ఉంది. స్టేజీకిముందు సమంగాఉన్న ప్రదే

శంలో చాలామంది స్త్రీలు కూర్చున్నారు. తెర ఎత్తక ముందు సరోజనీ దేవిగారు స్టేజీపైకి వచ్చి ఈ మాటలు చెప్తుంది.]

సరో—సోదరీమణులకు నమస్కారములు. ఇక రెండు మూడు నిమిషాలలో తెరఎత్తి నాటకం ప్రారంభిస్తారు. మీరు కొంచెం నిశ్శబ్దంగా ఉండాలె. ఇంత గోలగా ఉంటే నాటకం ఆడే వాళ్ళకు ఉత్సాహంగా ఉండదు. ఈ నాటకాన్ని కాంతం గారు కొందరు స్నేహితులతో కలిసి ప్రదర్శిస్తున్నారు. దాంపత్య ధర్మాన్ని, ఆ జీవితంలో ఉండే సౌందర్యాన్ని మాధుర్యాన్ని ద్యోతకం చేసే, ఒకటి రెండు దృశ్యాలు ఇప్పుడు ప్రదర్శింప బడుతాయి. చాలా చోట్ల నవ్వువస్తుంది నవ్వ వచ్చిందిగదా అని మీరు విరగబడి నవ్వకండి. (అంతా నవ్వుతారు) అదిగో, అంత పెద్దగా కూడా నవ్వకూడదు. (ఇంకా పెద్దగా నవ్వుతారు) ఈ నాటకం ఏమిటని కొందరు అడుగుతున్నారు. దీనికి మొగుడూ పెళ్లాం నాటకం అని పేరు. సెలవు. నవ్వకుండా చూడండి చూడకుండా నవ్వకండి, (చప్పట్లు నవ్వులు)

మళ్ళీ గంటకొడతారు.

సూరమ్మ—మళ్ళీ గంట ఎందుకే సీతా !

సీత—ఇక తెర ఎత్తుతారన్నమాట !

సూరమ్మ—అయితే ఇందాక ఓసారి కొట్టారుగా.

సీత—నీకేం తెలియదు అత్తయ్యా. మూడుసార్లు కొట్టాలె మూడోసారి గంట కొట్టటంతోనే తెర ఎత్తాలి.

సూరమ్మ—అదేనే, మూడుసార్లు ఎందుకూ అంటా?

సీత—(నవ్వి)ఎందుకేమిటి అత్తయ్యా. అట్లాకొట్టాలి. (మళ్ళీ గంట) అదిగో థర్డుబెల్ ఇక తెరలేస్తుంది.

[తెరవెనుక—కొబ్బరికాయ కొట్టిన శబ్దం కాంతం గారికి జై కాంతం స్నేహబృందానికి జై లోపల ఉన్న వాళ్ళంతా కలిసి అంటారు తెర లేస్తుంది.]

సూరమ్మ—సీతా గుసగుసలు.

సూరమ్మ—ఆ వేషం ఎవరే సీతా ?

సీత—అదే మొగుడు. ఈ నాటకంలో హీరో. విను విను......

---

మూడవ రంగము

స్థలం - స్టేజీ

నాటకం ప్రారంభం అవుతుంది

మొగుడు—పండుగకు క్రొత్త చీర కావలయునని గృహిణి గట్టిపట్టు పట్టినది. వలదని వారించి చూచెదను. (ప్ర) కాంతా. నన్నిట్లు వేధించుట నీకు తగునా ? ఇంక నైనను ఆమాట మానవు గదా !

పెళ్లాం—నాథా! నేను మిమ్ములను వేధించితినా ? ఎందుల కిట్లనరాని మాటలని యెదరు ? పతి మనస్సుకు కష్టము కలిగించుట సతికి ధర్మము కాదని నాకు తెలియదా? అట్లయిన వినుడు.

పతిభక్తి ప్రియురాలు పరగధర్మిష్ఠ
మొగుడు ఎంగిలి లేనిది కుడువ దెన్నడు
మొగుడుచే కొట్టబడి వగవ దెన్నడు.
కొట్టినా తిట్టినా, కోపించు టెరుగదు.
ఈ ఏడు జగములకు ఈశ్వరుండు కర్త
తనకు పెనిమిటికర్త తన ప్రాణ భర్త

అనెడి పతివ్రతాధర్మములు నాకు తెలియువా నాథా!

మొగుడు—అట్లయిన పండుగకు కొత్తచీర తెమ్మని అడుగకుము. అట్లడుగుట పతివ్రతా ధర్మముకాదు.

పెళ్లాం—కాదు, కాదు. మీది పొరపాటు. పతివ్రత చీరలకై అడుగవలయును. వెంటబడి వేధించ వలయును. మీరు నాకు కొత్తచీర కొనక తప్పదు.

మొ—కొనలేను ప్రాణప్రియా!

పె—కొనక తప్పదు, నాథా!

మొ—హా నేనేమి చేయుదును?

పె—లేకేం జానకమ్మ మొగుడు తన నిజ భార్యకు జరీచీర కొన్నాడు నాథా!

మొ—(విసుగుతో) వాడి మొగము తగుల వేయ వలయును.

పె—లక్ష్మి మొగుడు సిల్కుచీరను కొన్నాడుప్రియా!

మొ—వాడిని ముక్కలు ముక్కలుగా నరికినను పాపములేదు.

పె—రాజమ్మ మొగుడూ......'

మొ—(పళ్ళు బిగబట్టి) ఆపు ప్రాణసఖీ! ఆపు ఇక నేను భరించలేను. ఈ ప్రపంచములోని మొగుళ్ళ నందరిని చంపినను పాపము లేదు.

పె—అయ్యో! అశుభంబు శమించుగాక! లోకములోని మొగుళ్ళందరిని చంపిన నాగతి ఏమగును? నాథా నేనిట్టి మాటలు వినజాలను.

(అధ్యాత్మ రామాయణములోని కీర్తనలవలె)

పరుష వాక్కులనేల–పలికెదరు స్వామీ!
ఏల పలికెదరు స్వామీ
ఇట్టిమాటల నే–నెట్లు వినగలనూ
నేనెట్లు వినగలనూ
వినజాల వినజాల–వినజాలను స్వామీ
నే వినజాలను స్వామీ
వినజాల కనజాల–నేనిక మనజాల
నేనిక వినజాలను స్వామీ

మొ—అట్లయిన నీవు ఇక చీర తెమ్మని పోరుపెట్టుట మానుము. నేనునూ ఇట్టి ములుకులవంటి పలుకులను అనుట మానెదను.

పె—పండుగకు చీరను కొనియ్యనిచో నేను బ్రతకజాలను. నాథా! మీరు పట్టుపీడి, రట్టు సేయక నా గుట్టును కాపాడి నాకు సిల్కు చీరను కట్ట బెట్టుడు.

మొ—(స్వ) అహా! ఇదేమి మొండిపట్టు కొనలేను, ధనము లేదని ఎంత చెప్పినను ఇకాంత వినకున్నది. అయినను, ఇంకొకసారి, మృదు వాక్కులతోనే చెప్పిచూతును గాక (ప్రకాశముగా) కాంతా!

చెప్పెద నొకమాట చెవియొగ్గి వినుము.
చీర గొనగ ధనము - చెంత లేదు. కోమలాంగి
కొఱ కొఱలాడకే - కాంతరో నీవు
నీవు కోపించితే - నే నిలువలేను.

పె—(స్వ) పండుగకు ఒక్క చీరను దెమ్మని అడిగిన, నా నాథు డింత, చికాకు పడుట ఎట్టి పూర్వజన్మ సుకృతిమో కదా! అయినను ఇంకొకసారి అడిగి చూచెదను. (ప) నాథా నా ప్రార్థన వినుడు. ఒక్క చీరెను కొనుడు. నా ముద్దును తీర్చుడు. ఏల మీ కింత చీకాకు ?

మొ—మనోహారీ, మోహనాంగీ! ఎన్నిసార్లు నాచేత లేదని అనిపించెదవు! నేను ధనహీనుడను. ప్రస్తుతము దరిద్రుడను. నీ కోరకను తీర్చ నశక్తుడను. ఇంతిఏల? నేను చీరను కొనలేను.

పె—ఆహా ఎట్టి ఇక్కట్టు సంప్రాప్తమైనది. అమ్మాయి మీ కొమరిత కొత్త బట్టలకై ఏడ్చుచున్నది—

మొ—నీ ఏడ్పుచాలక అదికూడ ఏడ్చుచున్నది? సరి సరి (పద్యమువలె)

చీర దెమ్మని ఒక చెంప చేడియ గోలపెట్టు
కొత్తబట్టలని ఒక చెంప కొమరిత పోరుపెట్టు

ఇరువురును అప్పుడే ఇది నిక్కవంబు
సమయము ఎంత సంకటమైన పట్టిరా ప్రభూ !

పె—మీకు నిత్యంబులు కట్టిపెట్టి క్రొత్తబట్టలు కొనెడి ప్రయత్నంబు సలుపుడు.

మొ—నీవిట్లు మాననున్నావు. నాకు కోపంబు వచ్చుచున్నది.

పె—అట్లయిన నాకు ఏడ్పు వచ్చుచున్నది.

మొ—పొమ్ము. నా ఎదుటనుండి తొలగి పొమ్ము.

పె—అట్లే పోయెదను. (దుఃఖముతో) నా కర్మము నేను చేసుకొన్న పాపము. నా పూజఇట్లు ఫలించినది. అయినను ఇచట ఒక్క క్షణమైనను ఉండరాదు. నాథా! ఇదిగో నాథా ! పోవుచున్నాను. కాని నీవు చీర కొనకపోయిన మాటదక్కదు. ఇదియె నా నిశ్చయము. హా పరమేశ్వరా ! నాకు, నీ వేదిక్కు.

మొ—కాంతామణి కోపించి పోయినది. ఆ తన్వి— ఆ లతాంగి, సుగుణశీల, సుందరాంగి నాపై కినుకవూని నన్ను వీడిపోయినదృశ్యమును, 'మనసా!' స్మరించుకొనుము (చుక్కలు పెట్టిన లతలెక్క ఊ ఊలతో లేనన నన్నులతో పూర్తి చేయవలయును.)

శా. మట్టెల్ మ్రోయగ...... వేణీభరం......
బట్టైటై కటిఁజిమ్మ చీకటులు కాన్ అశ్రుపుంజబిడికల్
కట్టన్ జూపులు చిమ్మి కేగి దివి రోలంబాళి గల్పింపగా
....................మీనాక్షి దీనాకృతిన్.

వెడలిపోయినది సరే కానిమ్ము నేనునూ గట్టితనంబున దిట్టనై ఇకాప్పంత పట్టిన పట్టుదు పటాపంచలు చేయకున్నచో, నా పేరు కిరీటియే నినద భీషణ సంకము దేవదత్తమే కత్తి తిప్పుకొంటూ వెళ్ళిపోతాడు—తెర

---

## నా లు గ వ రం గ ము

### స్టేజీముందు

సూరమ్మ—ఇదేమిటే సీతా! నిజంగా నాటకంలాగే ఉన్నదే!

సీత—నాటకమే అత్తయ్యా.

సూరమ్మ—అదీసంగతి ఇది నిజంగా నాటక మన్న మాట! నేను ఏమిటో అనుకొన్నాను.

సీత—ఇప్పుడు తెలిసిందిగద! పోని బతికాం. అయితే, అత్తయ్యా! ఆ మొగుడు కత్తితిప్పుకొంటూ పోయినాడు ఏం జేస్తాడంటావు?

సూరమ్మ—ఏం జేస్తాడే—ఏమ్మి జెయ్యడు!

సీత—చంపేస్తాడేమో!

సూరమ్మ—చపటమే ఆ. అన్నీ చంపాడు!

సీత—మరి కత్తితిప్పాడు ఎందు కత్తయ్యా!

సూరమ్మ—ఊరికేనా మగవాణ్ణి అనిపించుకొందా మని!

సీత—(పెద్దగా) మళ్ళీ తెరఎత్తుతున్నా రత్తయ్యా!

సూరమ్మ—మళ్ళీ వాళ్ళేనా !

సీత—వాళ్ళే మొగుడు పరుగెత్తుకొని వస్తున్నాడు. కత్తితిప్పుకొంటూ ! (నవ్వి) కత్తితిప్పటం ఎందుకో మహా చంపేవాడిలాగ !

---

## అయిదవ రంగము

### స్టేజీ

మొ—ఛీ ఛీ నా మాటకు, ఈ కొంపలో విలువ లేకుండా పోయినది. నేను బ్రతికి ఏమి ప్రయోజనము ! నా మాట సాగక పోయిన తరువాత !

పె—సాగక ఏమండీ. మీమాట సాగుచునేయున్నది.

మొ—(విసుగుతో) నీ మొగుడు ఇంటికి పెద్ద. యజమాని. కవి. మానమర్యాదలు తెలిసినవాడు. ఇట్టివానికి మంచి చెడ్డలు తెలియవా ? వివేకము లేకుండునా ? అని నీవు అనుకొనవేమి భార్యా?

పె—అట్లనుకొంటిని ! అనుకొనే మోసపోయినాను భర్తా !

(అంతా నవ్వుతారు)

మొ—అట్లయిన నేను అవివేకి ననియే నీ యభిప్రాయమా ?

పె—ఆ మాట అనిన మీరు బ్రతుకనిత్తురా ?

మొ—బ్రతుకక నిత్యానని కాని లేనిచో నీ యభి ప్రాయం అంతే నన్నమాట !

పె—నాకు ఇది అంతయును తెలియదు. పండుగకు చీరకొనమని అడుగుట ఏమి ? మీ రింత గ్రంథము పెంచుట ఏమి ?

మొ—నేను కొనలేను కాంతా !

పె—కొనక తప్పదు నాథా !

మొ—అబ్బబ్బ నీవు పెళ్ళానివి కావు నా పాలిటి దయ్యానివి.

పె—మీరు మొగుడుకాదు. నా పాలిటి యముడు.

మొ—నేను నీతో వేగలేను.

పె—నేను మీతో సాగలేను.

మొ—హా! మహాప్రభూ! నా మెడకు ఈ రాక్షసిని ఏల అంటగట్టినావు ?

పె—ఈశ్వరా! నా గొంతుకోసినావు. నేనేమి పాపం చేసినాను ప్రభూ ?

మొ—ఛీ ఊరుకొనుము. నావంటి కవికి భార్యవగుట నీ అదృష్టము !

పె—నా అదృష్టమా ! అఘోరించినట్లున్నది ! ఇం తకూ మీరు చీర కొనకపోయినచో నేను ఊరుకొనను.

మొ—ఊరుకొనక తప్పదు.

పె—ఊరుకొనను.

మొ.—(ఇంకా కోపంతో) ఊరుకొనవలయును.

పె—ఊరుకొనను.

మొ—ఊరుకొనక ?

పె—మీరు కొనక ?

మొ—కొనకనా ?—కొనక ఊరకుండెదను. నీవుఎంత కొట్టుకొన్నను చీర కొనను.

పె—కొనరా ?

మొ—కొనను.

పె—కొనరూ ?

మొ—(బిగ్గరగా) కొనను.

పె—ఆలోచించు కొనుడు క్రొత్తచీర కొనెదరా కొనరా ?

మొ—ఆలోచించు కొంటిని. క్రొత్తచీర కాదుగదా పాతచీర అయినను కొనను.

పె— అట్లయిన చూచెదను గాక !

మొ—ఏమిటి నీవు చూచెడిది—నీవేమి చేయుగలవు? అబలవు—!

పె—నేను అబలను కాదు.

మొ—అబలవు.

పె—కాను ! (పెద్దగా)

మొ—(పెద్దగా) అవును.

పె—(పెద్దగా) కాదు !!

మొ—(తగ్గి) అట్లయిన నేను చీర కొనకుండిన నీవు ఏమిచేయగలవో చెప్పుము.

పె—చెప్పెదను. మీరు క్రొత్తచీర కొని ఇయ్యనిచో నేను వంట చెయ్యను.

మొ—చెయ్యక ?

పె—పడుకొనియెదను.

మొ—హాతోస్మి—హాతోస్మి—ఎక్కడ ?

పె—గదిలో.

మొ—గదిలో ? (ఆశ్చర్యంతో)

పె—అవును. గదిలో.

మొ—వంట ?

పె—చెయ్యను.

మొ—చెయ్యనిచో అన్నమెట్లు ?

పె—అన్నములేదు గిన్నములేదు. పస్తుపడుకొనవలసినదే !

మొ—ఔరా ! అంతపని చేయుటకు సంసిద్ధురాలవైతివా ?

పె—ఓ.

మొ—వంట చెయ్యవు ?

పె— చెయ్యను.

మొ—నీవు...వంట చెయ్యక పోయినచో...

పె—(ఆశ్చర్యంతో) ఆ.

మొ—నేను నీ...గదిలోకి వచ్చి......

పె—వచ్చి ? (ఆశ్చర్యముతో)

మొ—నీ ముఖమును బద్దలుచేసి, వీపును చిట్లగొట్టి, బుగ్గలను సాగదీసి, చెవులను మెలవేసి, చెక్కిళ్ళను ముద్దాడి నీచేత వంట చేయించగలను. ఇదియే నా ప్రతిజ్ఞ. చూడుము.

పె—మీ ప్రతిజ్ఞ చెల్లదు. (నవ్వి)

మొ—చెల్లును. (కోపంతో)

పె—అట్లయిన నేను ఇప్పుడే శయ్యాగృహంబును ప్రవేశించుచున్నాను, (పట్టుదల)

మొ—నేనునూ నీ వెనువెంటనే వచ్చుచున్నాను, నడువుము. (కోపంగా)

పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళిపోతాడు.

---

## ఆ ర వ ర ం గ ము

### స్టేజీముందు

సీతా—సూరమ్మ—సుందరమ్మ

సుం—(ప్రవేశించి) సీతా ! ఎట్లాఉందే !

సీత—చాలా తమాషాగాఉంది అత్తయ్యా నాటకం !

సుం—నిజంగానేనా ?

సీత—నిజంగానే అత్తా !

సుం—సీతా చూడూ! మాట. నాటకాన్ని గురించి అంతా ఏమనుకొంటున్నారో విను. సూరమ్మ—ఒదినా— నీవేమంటావు ?

సూరమ్మ—నే నేదో పూర్వకాలపు దాన్ని, నామాట ఎందుకు పోనిద్దూ !

సీత—ఆమె మాట మనకెందుకు అత్తయ్యా! అంతా బాగుందంటున్నారు. సూరమ్మ అత్తయ్యకు నచ్చవులే ఇల్లాంటివి.

సుం—నేను వెడతాను సీతా లోపల ఏంకావాలో చూడాలి.

సీత—వెళ్ళు అత్తయ్యా.

సీత—నీకు ఈ నాటకం బాగుండలేదా అత్తా ?

సూరమ్మ—బాగుండకేమమ్మా. బాగానేఉందే. కాని మొగుడూ, పెళ్ళాం పోట్లాడుకోటం ఒక నాటకమా ఏమిటి!

సీత—నీకు తెలియదులే అత్తయ్యా! చాలా తమాషాగాఉంది. అది సతీశానిని ఏమౌతుంది అత్తయ్యా ? కొడతా అంటాడే ఆ మొగుడు ?

సూరమ్మ—కొడితే కొట్టనూ కొడతాడు ఏం ?

సీత—కొడితే ఊరుకొంటుందా ఏమిటి ! చూద్దాం ఏమాత్రం కొడతాడో ?

---

## ఏడవ రంగము

స్థల—పడకగది

మొ—నామాటవినుము ఇంత పట్టు పట్టకుము. తరువాత దుఃఖపడిన లాభములేదు. బుగ్గలు వాయగలవు! చెంపలు బద్దలుకాగలవు! ఎముకలు విరిగిపోగలవు! జాగ్రత్త.

పె—ఏమైనను కానిండు. నేను ఆడినమాట తప్పువాదను కాను. వంట చేయనని అంటిని. వంట చెయ్యాను. ఈ శయ్యపై పవ్వళించెదను.

మొ—అట్లయిన నేనునూ, ఆడినమాట తప్పను కడసారి చెప్పుచున్నాను. వినుము. నీ పట్టును విడువుము. లేనిచో నిన్ను మోదకమానను.

పె—వినను.

మొ—అట్లయిన కాచుకొనుము.

(పద్యంవలెచదువవలెను—వచనంలాగకూడా చదవవచ్చు.)

ఆడి ఎన్నడు బొంకని వాడనేని
ఉదారుడనేని ధార్మికుడనేని
ప్రీతిగలవాడనేని భామినికి ప్రియభర్తనేని
పంతములు వదలుగాక ఇకాంత ఇపుడు.

శంకరయ్య—(ప్రవేశిస్తూ) ఓయీ మిత్రమా! ఆగుమాగుము.

మొ—ఎవరు నీవు ఏల వచ్చితివి ?

శం—ఆగుము.

(పద్యమువలె చదువవలెను)

నెమ్మిగ పండుగ రోజున
కమ్మగ కుడువందగును కాదకో ఇటులన్
వమ్మగ నిజకాంతలతో
ఇమ్మోయి పోరాడ ఎవ్వరొత్తురు సఖుడా.

కాన కాంతపై చెయ్యివేయకుము ఉండుము.

మొ—నేనుండను. ఈ పడతి పట్టిన పట్టు విడువక నన్నిట్టట్టు ఊగించుచున్నది. ఈ ఫుల్లాంభోరుహ నేత్ర పొగరణచక మానను.

శం—కొంచెము ఆగుము. (నొక్కి)

మొ—నేను ఆగను.

శం—ఈ రమణీలలామ ఏమి ఆగడము చేసినదో చెప్పుము.

మొ—నేను చెప్పను.

శం—అట్లయిన నీవు ఈమెను కొట్టుటకు వీలు లేదు.

మొ—వీలున్నది.

శం—వీలు లేదు. (పెద్దగా)

మొ—ఉన్నది (పెద్దగా)

శం—(పెద్దగా) లేదు. నేను కొట్టనియ్యను.

మొ—కొట్టనిచ్చెదవు.

శం—ఆగుము.

మొ—ఆగను.

శం—అట్లయిన ఏమిచేయుదునో చూతుము.

పె—నీవు ఏమి చేయగలవయ్యా. ఏమిచేయగలవు? (నిరసనగా)

శం—(స్వ) హతోస్మి. ఇదేమి చిత్రము. నేను, ఈ గృహిణిని రక్షించుటకై వచ్చియున్నాను గదా! ఈ వామలోచనయే నన్ను తృణీకరించుచున్నది. (ప్ర) ఓలలనా మణీ! నేను, నిన్ను, శిక్షించుటకై దండించుటకై, కొట్టుటకై, తన్నుటకై సిద్ధపడిన ఆ క్రూరాత్ముని బారినుండి రక్షించు టకై గదా వచ్చితిని. నేను రాకపోయినచో, నీ విభుడు నిన్ను బాదుటయు, నీవు పంకజశ్రీ సఖమైన మోముపయి చేల చెఱంగిడి బాల పల్లవగ్రాసకషాయ కంఠ కలకంఠ వధూకల కాకలీ ధ్వనిని ప్రాణవిభు కట్టెదుట ఏడ్చుటయూ జరిగియుండె డిది కదా!

పె—చాలు చాలు నీ అధిక ప్రసంగములు కట్టి పెట్టుము.

శం—నిన్ను మొగుడు కొట్టకుండా అడ్డము వచ్చి నాను.

పె—నీవు రాకూడదు.

మొ—(పెద్దగా) అవును. నీవు రాకూడదు.

శం—(స్వ) అయ్యో ఇదేమికర్మము. (ప్రకాశముగా) నీవు ఆడుదానిని కొట్టుచుండుటగని నే నడ్డము వచ్చినాను.

మొ—మహా గొప్పపని చేసినావు!—(వెక్కిరింతగా)

శం—నీవు అబలపై చెయ్యిచేసుకొనవచ్చునా ?

మొ—నాయిష్టము !

పె—(పెద్దగా) అవును ఆయన ఇష్టము.

శం—ఓ వనజదళాయతాక్షీ! నీవుకూడ భర్తతో చేరి నావు. నీకు దెబ్బలు తినుట ఇష్టమా ?

పె—ఆ ఇష్టమే, నా ఇష్టము.

మొ—అవును దానిఇష్టము.

శం—చిత్రముగ నున్నదే !

మొ—(వెక్కిరింతగా) చిత్రముగ నున్నది. మా మొగుడూ పెళ్లాము తగవులో కలుగజేసికొనుటకు నీకేమిపని అని అనుచున్నాను.

పె—నీకేమిపని అని నేనునూ అనుచున్నాను.

శం—నేను చేసినది తప్పపనే !

మొ—ముమ్మాటికితప్పు.

పె—శుద్ధతప్పు తెలివితక్కువ అవివేకము అసభ్యము బుద్ధితక్కువ.

మొ—బుద్ధి జాడ్య జనితోన్మాదము,

శం—సరే తప్పుఅని ఒప్పుకొనియెదను.

మొ—ఒప్పుకొని తీరవలయును.

పె—చచ్చినట్లు !

శం—తప్పే ! తప్పే ! తల్లీ ! తప్పే !

మొ—అట్లు సరిగా బుద్ధితెచ్చుకొనుము.

పె—ఇప్పుడు సరియైనదారికి వచ్చినావు.

శం—ఏమివిచిత్రము. పోట్లాడుకొనుచున్న భార్యాభర్తలు ఇద్దరూ ఏకమై నన్ను నిందించుచున్నారు. ఇద్దరును పోట్లాటకు సిద్ధముగుచున్నారు.

మొ—ఓ సిద్ధం! ఏమే సుందరీ, కమలాక్షీ! నీ నేమంటావు ?

పె—ఓ సిద్ధం ఎంతపెద్ద పోట్లాటకైనసరే రెడీ!

శం—ఇక మాట్లాడను.

పె—గప్ చిప్ గా నుండుము.

శం—పెండ్లామును కొట్టుచుండగా అడ్డము వచ్చుట తప్పుపని అయినది. అట్లయిన నీయిష్టమువచ్చినట్లు కొట్టుము.

మొ—నేను కొట్టను.

పె—వారు కొట్టరు.

శం—అదేమితిక్క ?

మొ—నాయిష్టము.

పె—అవును వారి ఇష్టము.

శం—సరే, నీకు ఇష్టమైనపుడే కొట్టుము.

మొ—నేను అసలు కొట్టను.

పె—అవును. అసలు కొట్టరేకొట్టరు మావారు!

శం—ఏమి ?

మొ—నీవు కొట్టమనిన నేను కొట్టను.

పె—అవును నీవు కొట్టమనిన కొట్టరు. వారిఇష్టమైన కొట్టెదరు, తన్నెదరు నీకేమి ?

మొ—(పెద్దగా) మాయిష్టము !

పె—(పెద్దగా) మాయిష్టము !

మొ— మేము మొగుడూ పెళ్లాలము.

పె—అవును. మేము మొగుడూ పెళ్ళాలము.

మొ—మేము కొట్టుకొనెదము !

పె—తన్నుకొనెదము !

మొ—గుద్దుకొనియెదము !

పె—గుంజుకొనియెదము !

మొ—తిట్టుకొనియెదము !

పె—తిమ్ముకొనియెదము !

మొ—నీకెందుకు ?

పె—అవును నీకెందుకు ?

మొ—మా యిష్టము ఏమే, మోహనాంగీ! ఏమనియెదవు ?

పె—అవును మనఇష్టము. నాథా!

శం—ఓహోహో పోనీ ముద్దుపెట్టుకొనవయ్యా !

మొ—ఓహోహో. నీవు చెప్పనక్కరలేదు. (వెక్కిరింతగా)

పె—ఓహోహో. నీవు చెప్పేదేమి ? (వెక్కిరింతగా)

శం—సరిసరి ! నేను వెళ్ళుచున్నాను. నీ భార్యను...

మొ—అవును. (పెద్దగా, కోపంగా) నా భార్యే ఏమే మదిరాక్షీ, ఏమందువు ?

పె—నేను మీ భార్యనే. మీ ప్రియురాలను మీ పాదదాసిని మన్మథరూపా!

మొ—మరి వీడెవడు అడ్డువచ్చుటకు? (నవ్వు)

పె—(నవ్వి) వీడు తిక్కశంకరయ్య!

మొ—(నవ్వి) పిచ్చినాగయ్య!

పె—(నవ్వి) వెఱ్ఱివెంగళప్ప!

మొ—పోవయ్యా పో!

పె—ఫో! ఫో!

(అందరును నవ్వుతారు)

---

## ఎనిమిదవరంగము

### స్టేజీముందు

సూరమ్మ—(నవ్వి) బాగా నేడుండే నాటకం సీతా నే నేమిటో అనుకొన్నాను. మొగుడూ పెళ్ళామూ ఆ శంకరయ్యమీద కాట్రకుక్కలాగ పడ్డారు చూశావా?

సీత—(నవ్వుతుంది) మొగుడూ పెళ్ళాం తగూలో (విరగబడి నవ్వుతుంది)

సూరమ్మ—ఏమిటే సీతా ఆ నవ్వు! చెప్పి నవ్వరాదూ!

సీత—అదికాదు అత్తయ్యా! మొగుడూ పెళ్ళాం తగూలో (నవ్వు)

సూరమ్మ—ఊం తగూలో?

సీత—జోశ్యం కలుగ జేసుకొన్న శంకరయ్యకు తగిన శాస్తి అయింది కదూ ?

సూరమ్మ—అంతేమరి !

సీత—నాటకం ఇంకా అయిపోలేదు అత్తయ్యా! అంతా కూర్చునే ఉన్నారు ఉండు లేవకు.

---

తొమ్మిదవ రంగము

స్థలం స్టేజీ

మొగుడు పాడుతూ ప్రవేశిస్తాడు.

మొ. రావే, రావే, నాచిలుక రావే
 ముద్దుపలుకుల – కలికీ రావె
 పట్టుచీరనూ – గట్టిన పడతీ
 బుట్టరెవికను – తొడిగిన భామా రావే, రావే.
 కాంతా, మనోహరీ, మోహనాంగీ,
 (పద్యమువలె — రాగముతో
 కట్టిడితనమును మాన కే
 గట్టిమనసు – కాంతా నీవు సుంతకరిగింపవే
 పట్టిన పట్టును విడువలేము
 గట్టిగ నను కౌగలింపగదవే చెలియా.

జరిగిన దేమోజరిగిపోయినది. గతంనాస్తిరమ్మ ప్రియా! రమ్మ.

పె—ఛీ నాథా! మీ ముందు నిలవరాదు.

మొ—పోనీ వెనుక నిలువుము. ప్రేయసీ !

పె—రాను. నాథా!

మొ—నేను నీ ప్రియనాథుడనే, కాంతా!

పె—నే కాదంటినా ! నీవు నా నిజనాథుడవు కావని నే నెప్పుడైన అంటినా నాథా !—నే నెప్పుడైన అంటినా ?—(మాటలు సాగదీసిజార్చి)

మొ—అయిన రమ్మి !

పె—కొత్తచీర ఇచ్చిన వచ్చెదను.

మొ—(నవ్వి) ఆఁహా దీనికింత ఆగడము చెయ్యవలయునా ? ఇదిగో చీర ఇదిగో రెవిక.

పె—మొదటనే ఇచ్చినట్లయిన ఇంతగోల కాకుండెడిది కదా !

మొ—ఓసీ! ఆర్యపుత్రీ! అమాయకురాలా! ఇది యంతయు ఒక క్రీడ. భార్యకు ప్రణయకోపంబు తెప్పించుటయు చివరకు నుపశమింప జేయుటయు—అను నీరెండు పనులును భర్త చేయవలసిన విధులు. ఇది ధర్మము. ప్రణయ కలహము చక్కగా నడచినది. ఇక రమ్మి మనము ఇరువురమును కలసి ఒకపాట ఏక కంఠముతో పాడుదము.

(ఇద్దరూ కలిసి పాడుతారు)

కూడియుండుట నేర్చుకోవోయి
పోరు చేటని తెలుసుకోవోయి

ముదిత కోరిన ముద్దుకోర్కెల
మోదమున తీర్చవలెనోయి !

కూడియుండుట—

గున్నమామిడి చెట్లపైనను
చిన్నకోకిల కూయవలెనోయి
తిన్ననై పిల్లలతో సంసారమూ
వెన్నెలలు వర్షించవలెనోయీ

కూడియుండుట.

అంతా నవ్వుకుంటూ పోతారు.

సీత—విరగబడినవ్వుతూ తమాషాగా ఉంది అత్తయ్యా నాటకం !

# 5

## మొదటి రంగము

### రాజు—సీత—రాజమ్మ

[రాజుఇల్లు-ఊరినుంచి రాజమ్మగారువచ్చికొడుకు సంసారపు పరిస్థితులు తెలుసుకొంటున్నది.]

సీత—ఇటురా అత్తయ్యా! వంటఇల్లు చూశావుగా ఇదిహాలు.

రాజమ్మ—చక్కగాఉందేపిల్లా. కావలసినంత గాలీ అదీసి! దోమలు లేవుగా!

సీత—ఎక్కే దోమ అన్నమాటలేదు.

రాజమ్మ—బాగుందమ్మా, మంచిఇల్లే సంపాదించారు!

సీత—దానికి ఎన్ని తిప్పలు పడితేనో దొరికింది అత్తయ్యా! ఎంతమందో చెపితే ఇచ్చారు.

రాజమ్మ—అల్లాగా బాగానేఉంది ఈ పెట్టెఏమిటే అమ్మాయ్?

సీత—(నవ్వి) పెట్టెకాదు అత్తయ్యా. రేడియో!

రాజమ్మ—రేడియో! రేడియో అంటే ఇదేనా! ఎల్లాఉంటుందో అనుకొన్నాను. ఇదేకదే పాటలు పాడుతుంది!

సీత—అవును అత్తయ్యా. అంటే, మద్రాసులోనూ, బొంబాయిలోనూ, కలకత్తాలోను ఎక్కడైనాసరే, ఎవరైనా పాడుతుంటే ఇక్కడ వినిపిస్తుంది!

రాజమ్మ—ఆఁ ఎక్కడ ఎవరు పాడుతున్నా వినివిస్తుం దన్నమాట!

సీత—విను అత్తయ్యా. ఈ సంగీతం మద్రాసునుంచి వస్తున్నది! కలకత్తా స్టేషనుఇది. విన్నారా? అక్కడఎవరో మాట్లాడుతున్నారు విన్నారా? ఇట్లాగే ఎక్కడనుంచిఅయినా వినపడుతుంది.

రాజమ్మ—తమాషాగా నేఉందే అమ్మాయి! సరే గాని దానినోరు కాస్తముయ్యి మాట్లాడుకొందాం!

సీత—నాకు దీనితోనే ప్రొద్దుపోతుంది అత్తయ్యా. ఆయన ఇంట్లోలేనప్పుడు దీనిని పెట్టుకు కూర్చుంటాను.

రాజమ్మ—అయితే వంటా, పెట్టా ఏమీ లేదా ఏమిటి?

సీత—దీనిని వంటఇంట్లోకికూడా తీసికెళ్ళి పెట్టుకో వచ్చు!

రాజమ్మ—అయితేమటుకు వంటఇంట్లో ఎందుకే ఈ తద్దినం! పొగచూరి పాడైపోదటే!

సీత—మా యింట్లో పొగలేదు అత్తయ్యా.

రాజమ్మ—అదెట్లాగే? వంటజేసుకోవా? పొయ్యి రాజెయ్యవా?

సీత—(గర్వంగా) పొయ్యిలేదు అత్తయ్యా!

రాజమ్మ—అమ్మో! పొయ్యిలేకుండా వంటఎట్లాగ చేస్తావే అమ్మాయ్?

సీత—ఎలక్ట్రిక్ స్టౌమీద వంటచేస్తాను అత్తయ్యా.

రాజమ్మ—అదేమిటే—పిల్లా ?

సీత—అంటే ఎలక్ట్రిక్ పొయ్యి అన్నమాట !

రాజమ్మ—ఎలక్ట్రిక్ పొయ్యి ఏమిటే నాపిండాకూడు. అయితే ఎలక్ట్రీ వంటకూడా చేస్తుందా ! ఏమిటికర్మం ?

సీత—చేస్తుంది. తొందరగాకూడా వంట అయిపోతుంది. అత్తయ్యా ! కూర్చో అత్తయ్యా ! నుంచునే ఉన్నావు !

రాజమ్మ—ఇట్లా క్రింద చాపమీద కూర్చుంటాగాని—ఈకుర్చీ ఎంత బాగుందే చాలాఖరీదుగలది అనుకొంటాను !

సీత—అవును అత్తయ్యా. (ఫాన్ తిప్పుతుంది)

రాజమ్మ—ఇదేమిటేవ్ ఇంతచక్కగా గాలికొడుతున్నది? మర విసనకఱ్ఱటే అమ్మాయ్! ఎంతబాగుందే తల్లీ! ఇల్లంతా ఇంద్రలోకంలాగఉంది. ఎలక్ట్రీతోనే వంట ! విసరటానికి ఎలక్ట్రీ ! దీపంకూడా అదేకదూ ! ఎంతబాగుందే ఈ ఏర్పాటుఅంతా ! పెద్దచదువులు చెప్పించాము పొలంబొట్రా అమ్మి నాలుగు డబ్బులు వెనకేసుకొని మాకు ముసలితనంలో అక్కరకొస్తాడని ! అయితే పడుకోటంకూడా అక్కడేనన్నమాట మంచం ఇక్కడేఉంది !

సీత—అవును అత్తయ్యా !

రాజమ్మ—ఈ మంచం చాలాబాగుందే కోడలా, అవునుగాని అమ్మాయ్ ఈ మంచం కుర్చీలూ ఇవన్నీకొన్నారు గదా బోలెడు ఖరీదు కాలేదుటే !

సీత—అఁహా ఎంతో కాలేదు.

రాజమ్మ—అదేమిటే, అల్లాగంటావు. ఎందుకు కాదూ?

సీత—అసలు, ఇవన్నీ కొనలేదు అత్తయ్యా.

రాజమ్మ—కొనకపోతే ఎట్లావచ్చాయ్యే?

సీత—షాపులో తెచ్చాము.

రాజమ్మ—షాపులో తెస్తేమటుకు డబ్బు ఇయ్యకుండా ఇచ్చారంటావా?

సీత—ఇస్తారు అత్తయ్యా.

రాజమ్మ—ఇదెక్కడి విడ్డూరమమ్మా ఊరికే ఇస్తారంటావు! ఎందుకిస్తారే? కోడలా?

రాజు—(ప్రవేశిస్తూ) పిన్నివచ్చిందే! ఎప్పుడొచ్చావమ్మా? అంతా బాగున్నారా?

రాజమ్మ—ఇప్పుడే వచ్చాను నాయనా, అంతా బాగానేఉన్నారు. అదిసరేగాని అబ్బాయ్ ఈ కుర్చీలూ ఇవీ కొనకుండా షాపువాళ్ళు ఇచ్చారంటుంది. ఏమిట్రా కోడలు! ఎక్కడా వినలేదు. ఊరికే ఇస్తారురా?

రాజు—ఇస్తారు పిన్నీ.

రాజమ్మ—అదేమిట్రా, నీవూ అల్లాగే అంటావు. ఊరికే ఇస్తారా?

రాజు—ఊరికేఅంటే మరీఊరికే కాదుపిన్నీ. ఖరీదు ఇయ్యనక్కరలేదు. కాని నెలకు ఇంతఅని అద్దె కట్టాలె.

రాజమ్మ—ఏమిటీ! కుర్చీలూ బల్లలూ అద్దెకిస్తారూ! ఇదేమిట్రా ఎక్కడావినలేదు. తమాషాగా నేఉంది. అయితే ఇవన్నీ అద్దెవే?

రాజు—ఆ.

సీత—అదేమిటండి అల్లాఅంటారూ? ఆ మంచం అద్దెదా?

రాజు—అవునుపిన్నీ. ఆ మంచం మటుకు అద్దెకు తెచ్చిందికాదు. అది చేయించాము.

సీత—ఆఁ మీరు మహా చేయించినట్లు మాట్లాడు తారేం! అయ్యో! అయ్యో! మీరు ఆమాత్రంకూడానా! నేనే చేయించాను అత్తయ్యా. ఇంట్లోరెండు మంచపుకోళ్ళు ఉన్నాయి. అవి ఊరికేపోతైఅని మిగతా కోళ్ళకూ పట్టెలకూ సరిపోయే ఓకుకొని ఈ మంచం చేయించాను.

రాజు—(వెక్కిరింతగా) ఆఁ చేయించింది అప్పుజేసి!

సీత—ఓయబ్బ! కాస్తఅప్పుఅయితే మరేంఫరవా లేదు. ఆ మంచం నా స్వంతం. ఆ అప్పు నేనే తీర్చేసుకొం టాను.

రాజు—ఆ తీరుస్తావు! ఎక్కడనుంచి తెచ్చి తీరుస్తావు చెబుదూ! నా సంపాద్యంలోనుంచేగా!

సీత—అయితే మటుకు! ఆ మంచం నా స్వంతం అత్తయ్యా. ఎందుకు ఇన్ని మాటలు!

రాజు—ఊఁ. నీ స్వంతం!

సీత—స్వంతంగాక మీదా. చెబుదురూ నేను చేయిం చాను. నా స్వంతం!

రాజమ్మ—మీరు ఇద్దరూ కీచులాడుతారు ఎందుకట్రా పోనీ ఆమంచం దానిస్వంతం అయితే అయిందిలే-నీవుఊరుకో-

ఒసేఁయ్ కోడలా నేనొకమాట చెబుతానువిను. ఆ మంచానికి అయిన అప్పుతీరిందాకా అది నీ స్వంతంకానట్టే ఆ రెండు కోళ్ళూ తప్ప!

సీత—ఆ రెండుకోళ్ళూ కాదు అత్తయ్యా ఈ రెండు కోళ్ళూ మనవి!

రాజు—మిగతాదిఅంతా అప్పులవాళ్ళది!

సీత—అల్లాగంటేనే నాకు ఒళ్ళుమండిపోయేది,(వెక్కిరింతగా) మీా రేడియో? దానిసంగతేమిటి చెబుదురూ!

రాజు—రేడియోకేం—! అది హామూారా స్వంతం!

సీత—ఆ స్వంతం! అదీ అప్పేను అత్తయ్యా.

రాజమ్మ—బాగానేఉంది వ్యవహారం!

రాజు—(సీతతో) అది అప్పుజేసికొన్నానూ. అబ్బ! ఏం తెలివి!!

సీత—మరెట్లా కొన్నారు? ఊ మరెట్లా కొన్నారు చెబుదురూ?

రాజు—డబ్బుపారేసి, తెలిసిందా? క్యాష్—మరేమిటి?

సీత—అబ్బ. క్యాష్! అంతాఇచ్చారా? నా దగ్గర ఈ కోతలు కోయకండి. (నవ్వి) లేదు అత్తయ్యా. అంతా వట్టిదే. మూాడువందలయాభై రూపాయలూ ఇచ్చేకొన్నారేమో కనుక్కోండి. అత్తయ్యా!

రాజమ్మ—ఏంరా ?

రాజు—అదికాదుపిన్ని (సీతతో) ఏమ్‌నీవు ఇట్లా మాట్లాడితేనే! క్యాష్ ఇయ్యాలా, ముందు గూాభై ?

సీత—యాభై ఇస్తే ఏమైనట్లు! మిగతా మూడువందలూ ?

రాజమ్మ—అబ్బ ! మూడువందలే !

సీత—మూడువందలేమిటి, ఇంకావడ్డీ అదీకలిసిచాలా అవుతుంది అత్తయ్యా.

రాజు—అయితేనేం ! నెలకు ఇంతఅని ఇస్తే అదేతీరిపోతుంది ! నీకెందుకూ ? ఆ అప్పు నేను తీర్చుకొంటాను.

రాజమ్మ—బాగుందిరా, నాయినా. చాలాబాగుంది. మంచంఅప్పుఅదితీర్చుకొందిటు! రేడియోఅప్పు నీవుతీర్చుకొంటావు. భలే ! అయితే ఈ కుర్చీలూ బల్లలూ వీటిఅద్దె ఎవరు తీరుస్తారురా నాయినా ?

రాజు—అది జాయంటు !

రాజమ్మ—మరిఇంటిఅద్దె ! అదెంత ?

సీత—ఇంటిఅద్దేమిటి ? అద్దెఇయ్యంగా ?

రాజమ్మ—అద్దెఇయ్యకపోతే బయటికి నెడతారు. ఆ పనిమటుకు చెయ్యబోకునాయినా. ఏనెలఅద్దె ఆనెల వాళ్ళ ముఖాన పారేస్తుంటే తకానాలేదు.

రాజు—అదికాదుపిన్నీ. ఈ ఇంటికిఅద్దె ఇయ్యక్కరలేదు.

సీత—(నవ్వి) ఈ ఇల్లు మా స్వంతం అత్తయ్యా.

రాజమ్మ—అయితే ఈ ఇల్లు కొన్నారా ఏమిట్రా?

సీత—అవును.

రాజమ్మ—డబ్బు ఎక్కడిదిరా కొంటానికి? మంచం కొంటానికేలేక అప్పుజేస్తివిగదా!

రాజు—ఇప్పుడు అద్దెకుఉన్నా నెలకు ముప్పై ఎల్లాగూ ఇవ్వాలె! ఇల్లాగ ఎన్నాళ్ళుఇచ్చినా అద్దెఇల్లు అద్దెఇల్లే! అందుకని నెలకు ఎనభై చొప్పున అయిదేండ్లలో తీర్చేపద్ధాటు మీద అయిదు వేలకు ఈ ఇల్లు కొన్నాము పిన్నీ!

రాజమ్మ—అయితే అబ్బాయ్ నెలనెలా రేడియోకు ఓపాతిక ఇస్తావు! ఇంటికని ఎనభై ఇస్తావు. కుర్చీలు అవీ అద్దెకు తెచ్చావు! వాటిక్రింద ఓ ఇరవై అయినా ఇస్తావుకదా!—మరి—

సీత—ఇరవై గాదు అత్తయ్యా పదిహేనే!

రాజమ్మ—పోనీ...పదిహేను! అయితే మటుకు మొత్తం నూటపదిహేను అయింది. నీకుజీతం నూరేకదా ఎట్లాగురా అబ్బాయి!

రాజు—ఇప్పుడు నూటఇరవై ఇస్తున్నారు.

రాజమ్మ—అయితేమటుకూ దానికీ దానికీ సరిపోయిందనుకో మరితిండికీ?

సీత—తిండికెంత కావాలె అత్తయ్యా! ఇద్దరమేగా నలభై అయిదుచాలు!

రాజమ్మ—ఆ వలక్షై అయిదు అయినా ఏంరా నాయినా! అదీకాక చాకలి, మంగలి, సినిమా వీటికి అన్నిటికీ డబ్బు ఏదీ అంటా!

సీత—మేము అల్లాంటి వాటికి దేనికీ డబ్బు తగలెయ్యం అత్తయ్యా.

రాజు—వాటికి తగలేస్తే సంసారంచేసినట్లే! క్లుప్తంగా వాడుకోవాలె!

రాజు—ఎంతక్లుప్తంగా వాడినా———

సీత—ఓ పదిహేను అత్తయ్యా.

రాజు—(కోపంగా) ఆఁ పదిహేను! ఎక్కడనుంచి పదిహేను. పదికంటే ఎక్కువఖర్చు చేయటానికీవీల్లేదు.

సీత—(విసుగ్గా) బాగుంది. పది ఎట్లా సరిపోతయ్యి?

రాజు—సరిపోవాలె!

సీత—సరిపోవు!

రాజు—సరిపోకపోతే ఊరుకో.

సీత—వీటికి అన్నిటికీ పదిట! చూశావు అత్తయ్యా మీ అబ్బాయి మాటలు!

రాజు—ఎట్లాసరిపోతయ్యిరా నాయినా?

రాజు—సరిపుచ్చుకోవాలెపిన్నీ మరి ఏంజేస్తాము.

సీత—చూడుఅత్తయ్యా. ఎట్లాగూ సంసారం చెయ్యటం ఈ మనిషితో!! నేను కాంగా ఎట్లాగో ఓరగబెట్టుకు పోతున్నా గానీ, ఇంకొకరు అయితేనా ఈ పాటికి!

రాజు—అబ్బ, నీవు కాంగా చేస్తున్నావు! మహా లావు శాంతమూర్తివి!

సీత—అవునండి.

రాజు—కాదులే ఊరుకో.

రాజమ్మ—ఇదేం పోట్లాటరా రాజూ. ఇదేమన్నా బాగుందేసీతా! తిండికిఎట్లాగూ రు 45 అని ఇద్దరూ ఒప్పుకొంటిరి! ఇక పైకర్చు పదా, పదిహేనా అని పోట్లాటఎందుకుర్రా? పదేఅనుకో. అయితేమటుకు ఈ రు 55 ఎక్కడనుంచి తెస్తావురా!

సీత—అదే ఆలోచిస్తున్నాను.

రాజు—(వెక్కిరింతగా) ఆలోచిస్తున్నారు! తెలివి! తెలివని! ఇంకా ఆలోచిస్తునే ఉన్నాననుకొన్నావ్? ఆలోచించేశాను!

రాజమ్మ—ఏమిటా ఆలోచన నాకుకొంచం చెబుదూ?

రాజు—ఏముందిపిన్నీ—బ్యాంకీలో నాకు అయిదు వందలరూపాయలదాకా అప్పుఇస్తారు. అదితెచ్చి పెట్టెలో పడేసి నెలకు ఓ యాభై తీసి జీతానికి చేరిస్తే సరిపోవటం లేదూ?

సీత—భాగావాలత్తయ్యా! ఎంతమంచిఉపాయమో!

రాజమ్మనిజమేఅనుకో, ఆ అయిదువంలరూపాయలూ ఎట్లాతీరుస్తావ్రాఅంట?

సీత—తీర్చటం విషయం ఎప్పుడో మెల్లగా తీరిగ్గా ఆలోచించుకోవచ్చు!

రాజమ్మ—అదెట్లా! బ్యాంకీవాళ్ళు ఊరుకొంటారా?

రాజు—ఊరుకొంటారు.

రాజమ్మ—ఎన్నాళ్ళు ఊరుకొంటారురా నాయినా?

సీత—కొన్నాళ్ళు ఊరుకొంటారుగా అత్తయ్యా.

రాజు—అబ్బా! నీకన్నీ తెలిసిందానివిలాగే మాట్లాడుతావు. కొన్నాళ్ళా?

రాజమ్మ—అట్లా కరవొస్తావు. అది అన్నమాటలో తప్పేముందిరా నాయినా!

రాజు—అన్నీ తెలిసినట్లే మాట్లాడుతుంది చూడు పిన్నీ! కొన్నాళ్ళేమిటి! రెండేళ్ళదాకా మాట్లాడరు!

రాజమ్మ—దాని తరువాతమటుకు ఇవ్వాలంటావా?

సీత—అప్పుడు చూచుకోవచ్చు.

రాజు—ఏంజూస్తావు చెప్పు? ఊ చెప్పు నీ తెలివి చూద్దాం?

సీత—ఏమో...మరి ఏంజేస్తారోమీరు!

రాజు—ఇంహ ఊరుకో. నీకు ఏంతెలుసు. ఆర్థిక శాస్త్రముచదివినవాడిని కాబట్టి ఆవిషయం అంతా ఎలానడవాలో ప్లాను వేసిపెట్టాను.

రాజమ్మ—ఏంజేస్తావురా రాజూ నాకూ_డా చెప్పు!

రాజు—ఏమ్మీ లేదుపిన్నీ రెండుపండ్లదాకా ఊరుకోటం ముందు. ఆ తరువాత బ్యాంకీవాళ్ళు మరీ ఒత్తిడిచేస్తే ఏ షాహుకారు దగ్గరఅయినా, ఈ ఇల్లుకాస్తా తనఖాపెట్టి ఓ వెయ్యిరూపాయలు తెస్తాను.

రాజమ్మ—ఇంకో అప్పు అన్నమాట!

రాజు—అవునుపిన్నీ. అల్లాగ తీసుకొచ్చి బ్యాంకి వాళ్ళకు ఇయ్యాలిసింది వాళ్ళముఖాన పారేసి మిగిలింది పెట్టెలో పెట్టుకొని మళ్ళీ రెండుమూడేళ్ళు నెట్టేస్తాను.

సీత—చూశారా అత్తా. ఆర్థికశాస్త్రం చదువు కొన్నారు ఆయన! చదువుకొన్న వాళ్ళకూ చదువుకోని వాళ్ళకూ ఉండే తేడా తెలిసిందా ఇప్పుడు!

రాజమ్మ—నాముఖం నాకేమీ తెలియటం లేదత్తా. ఇప్పుడు ఓవెయ్యి అప్పు తెస్తానన్నావు! రెండేళ్ళుఅయిన తరువాత నయినా ఆ అప్పు తీర్చాలంటావా లేదంటావా? అప్పటికి అది తడిసి మోపెడై కూర్చోదూ?

రాజు—ఏమీ ఫరవాలేదు.

రాజమ్మ—ఎట్లారా?

సీత—ఏముందీ,అప్పుడాయిల్లుఅమ్మేస్తాముఅత్తయ్యా!

రాజు—అమ్మేస్తావు! మహా తెలివిగా చెప్పావు! అమ్మేస్తావూ! ఎట్లాఅమ్మేస్తావు! అప్పటికి ఇంటిమీద అప్పు తీరి ఈ యిల్లు స్వంతమైతేగద!

రాజమ్మ—మరి ఏంజేస్తానంటావూ?

రాజు—దానికంతా ప్లాను వేశానుపిన్నీ, ఆ సాహుకారు మళ్ళీ గొంతుమీద కూర్చుంటే, ఇంకోకడిదగ్గర పది హేను వందలరూపాయలు తెచ్చి, వాడి వెయ్యి వాడిముఖాన పారేసి మళ్ళీకొన్నాళ్ళు నెట్టేయటం!

సీత—చూశారా అత్తయ్యా, ఎట్లా నడుస్తుందో!

రాజమ్మ—అదిసరేగాని. ఎన్నాళ్ళని ఇల్లాగా?

సీత—ఎన్నాళ్ళయినా!

రాజు—(వెక్కిరింతగా) ఆ ఎన్నాళ్ళయినా! నీకు తెలుసుమహా!

రాజమ్మ—దానిమీదకు ఒంటికాలుతో పోతావు ఎందుకురా, పోనీ చెప్పరాదూ?

రాజు—అంతా ప్లానుప్రకారం, లెక్కప్రకారం నడుస్తుందిపిన్నీ. ఏమిటీఅంటే ఇల్లుమనదైనాదాకా, ఇట్లాగే గడపటం. ఇల్లుమనది కావటంతోనే తాకట్టున ఇల్లు అమ్మేసేయటం, అప్పులన్నీ తీర్చేయటం, హాయిగా కూర్చోటం!

రాజమ్మ—ఈ ప్లానుఏమిటో, ఈ గొడవ ఏమిటో నాకు తెలియటం లేదు నాయినా ఇల్లు అమ్మితే దాని తరువాత మళ్ళీ అప్పుఎల్లాగ పుడుతుంది? ఎట్లాగడుస్తుంది ఇంత ఖర్చు పెట్టుకొన్నపుడు!

రాజు—నీకు తెలియదుపిన్నీ. అదంతా ఆర్థికశాస్త్రానికి సంబంధించిన విషయము. ఎన్నోవిషయాలు తెలిస్తేగాని ఈ విషయం తెలియదు నీకెందుకు నేనుచేస్తాగా. ఇంకోసంగతి ఏమిటీఅంటే, అప్పటికి రేడియో, సైకిలు, అన్నీకూడా నా స్వంతం అవుతయి, నాయిష్టం. ఏదైనా అమ్ముకోవచ్చు.

రాజమ్మ—ఈ అప్పులేమిట్రా, ఎందుకురా. అప్పులు చేయటం ఎందుకూ తీర్చటం ఎందుకూ!

సీత—చేయకపోతే ఎట్లాగడుస్తుంది!

రాజు—గడవటానికా, అబ్బ, ఎట్లాగయితేనేం తెలివి గలవానివి కనిపెట్టావు!

రాజమ్మ—మరిఎందుకు చెప్పు. నాకూ తెలియటం లేదు!

రాజు—ఆస్తి ఏర్పరచుకోటానికి పిన్ని.

రాజమ్మ—ఇదేమి ఆస్తి ఏర్పరచటంరా అబ్బాయి! అప్పుజేసి ఆస్తిఏర్పరుస్తావన్నమాట.

రాజు—అవునుపిన్ని.

రాజమ్మ—అప్పులుజేసి ఆస్తి ఏర్పరచటం నేను ఎక్కడా చూడలేదురా నాయినా.

రాజు—ఈ పద్ధతి. సాధారణంగా ఎవ్వరికీ తెలియదు పిన్ని—చదువుకొన్నవాళ్ళకే తెలియదు. నేనంటే ఆ విషయమై ప్రత్యేక కృషిచేశాను.

రాజమ్మ—చాలా తమాషాపనే చేస్తున్నావు.

సీత—మీ అబ్బాయి. చాలాతమాషాలు చేస్తారు అత్తయ్యా.

రాజమ్మ—అల్లాగే ఉంది చూస్తే......

బియ్యంవర్తకుడి గుమాస్తా బయటినుండి పిలుస్తాడు.

గుమాస్తా—రాజుగారు ఉన్నారాఅండి.

రాజు—సీతా ఎవరో చూసిరా?

సీత—చిల్లరకొట్టు ఆసామి గుమాస్తాను పంపాడు.

రాజు—ఏడవలేకపోయినాడు. ఎందుకో కనుక్కోక పోయినావ్రూ ?

సీత—ఎందుకేమిటి. వాడికి బాకీలేమూ? ఇయ్యమంటు న్నాడు !

రాజు—రేపో ఎల్లుండో పంపిస్తానని చెప్పు.

రాజమ్మ—అయితే నాయినా బియ్యం పప్పు ఉప్పు కూడా అప్పేనన్నమాట !

రాజు—ఆ.

సీత—రేపువస్తానని వెళ్ళారండి ఆ గుమాస్తా.

రాజు—సరే.

సీత—రండి అత్తయ్యా భోజనాలవేళ అయింది !

రాజమ్మ—ఛీ. నేను భోజనంచెయ్యను.

సీత—ఏమండి అత్తయ్యా. ఏం అల్లా అంటున్నారూ?

రాజమ్మ—ఛీ. ఆ ఎలక్ట్రీ పొయ్యిమీద వండినకూడు నేను తిననురా నాయినా. ఊర్రైలుకు వెడతా. ఒకబండిని కేక వెయ్యరా అబ్బాయి! ఉండను.నాయినా! తొందరగా వెళ్లాలె పనికూడా ఉంది. రైలువేళ అయినట్లుంది. దబ్బున కేకేసుకురా పో.

రాజు—సరే. బండిపిల్చుకొస్తానుగాని సీతా, నేను వచ్చేలోపున, మా పిన్నికి కాస్త ఏదైనా ఫలహారంపెట్టు.

సీత—లెండిఅత్తయ్యా.

రాజమ్మ—నేను ఏమీతిననే కోడలా !

సీత—పోనీ రెండు అరటిపండ్లు పుచ్చుకోండి.

రాజమ్మ—అహాహా ఏమీవద్దుగాని అమ్మాయ్! మీ సంసార పరిస్థితులు ఏమీ బాగుండలేదే! ఇది నాస్వంతం, ఇది అప్పులవాళ్ళది కాదుఅని చెప్పకొనేందుకు ఒక్కవస్తువా లేకపోయె ఇంట్లో! ఇదేం కర్మమే ఇట్లాగేనా డబ్బువాడు కోటం ఎబ్బే!

సీత—ఏంజెయ్యను అత్తయ్యా.

రాజమ్మ—నీవు ఏంజేస్తావులే. చూడూ ఓ యాభై రూపాయలు ఇస్తాగాని ఏదైనా ఒక బాకీతీర్చి, ఒక్కవస్తువైనా స్వంతం అనిపించుకోండి. రారా రైలుబండి ఎక్కిద్దువుగాని.

సీత—ఉండ కుండా వెడుతున్నారు అత్తయ్యా! ఏమండోయ్ మిమ్మల్నే మీరు చప్పనరండి. అక్కడనుంచి ఎక్కడికైనా వెళ్ళక!

---

## రెండవరంగము

పడకగది సీతఒంటిరిగా పిల్లవాణ్ణి ఆడిస్తూఉంటుంది.

సీత—(నాలికతో శబ్దంచేసి)......హాయీ

గోపాలకృష్ణమ్మ పెళ్ళయ్యేనాడు
గోరింట పూచింది కొమ్మలేకుండ
మాయింట అబ్బాయి పెళ్ళయ్యేనాడు
మల్లెల్లుపూచేయి మొగ్గలేకుండా హాయ్

ఊరుకోవోయినాన్న—మా తండ్రి కదూ ! ఊరుకో.

మాణిక్యం—అమ్మా !

సీత—ఎవరూ, ఏంమాణిక్యం, ఏం, ఇల్లావచ్చావు !

మాణి—డాక్టరుగారు పంపారమ్మా మీకు కాన్పు చేసినందుకు ఆయనగారికి యాభై రూపాయలు ఇయ్యాలటగా ఇప్పించుకు రమ్మన్నారు.

సీత—ఇప్పుడెట్లా మాణిక్యం ! ఇస్తాములే !

మాణి—అల్లాగ ఈల్లేదుటండి. సంవత్సరమైందట. ఇక ఉండనన్నారు.

సీత—ఉండకపోతే ఎట్లాగు మాణిక్యం ?

మాణి—కోపంమాట లంటున్నారమ్మా తల్లీ ! నాకు డబ్బుఇయ్యకుండా బిడ్డను ముద్దెట్టుకొంటానికి బుద్దెట్లా పుడుతుందో ఆమెకు. అని విసుక్కున్నారమ్మా నాకేకష్టం వేసింది.

సీత— ఏమిటీ ఛీ, ఛీ. ఉండుఇచ్చేస్తాను.

తలుపుకొట్టి రాజువస్తాడు.

రాజు—సీతా !

సీత—పంపిచారా అత్తగారిని. ఉండకుండా వెళ్ళింది చూశారా.

రాజు—వెళ్ళితే వెళ్ళిందిగాని, ఆ యాభై ఇల్లాగ ఇయ్యి దారిలో బియ్యపువర్తకుడు కనపడి, అన్నంతినేటప్పుడైనా జ్ఞాపకంరాదా నాకుబాకీ అన్నసంగతి అన్నాడు. ఛీ—ఆ యాభై వాడిముఖాన పారేస్తాను. ఇల్లాఇయ్యి.

సీత—అయ్యో. లేవండీ!

రాజు—అప్పుడే ఏంజేశావు?

సీత—నాకు కాన్పుచేసిన డాక్టరుగారికి ఇయ్యాలిగా ఆయన కబురుచేస్తే ఇచ్చేశాను.

రాజు—చచ్చానే. ఆయనకు ఎందుకిచ్చావే! ఏం తొందర! ఆయనకు ఇయ్యకపోతేనేం!

సీత—నా బాకీ తీర్చకుండా, బిడ్డను ఎల్లాగ ముద్దెట్టు కొంటున్నది అని అడిగాడట. అందుకని ఇచ్చేసి, బిడ్డను ముద్దెట్టుకొంటానికి సంపూర్ణమైన హక్కును సంపాదించాను.

(బిడ్డను ముద్దాడుతుంది)

రాజు—సరే. మంచిపనే చేశావు! కాని ప్లాను ప్రకారం నడవటంలేదు. వ్యవహారం ఎట్లా?

సమాప్తము.

—

# శ్రీ వేదాంతకవిగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| కెరటాలు | | 1 | 0 | 0 |
| కవితాసంస్థానము | | 2 | 0 | 0 |
| అవ్యాయపుష్పాలు | | 0 | 12 | 0 |
| దండయాత్ర | | 1 | 0 | 0 |
| పరదలు | | 1 | 0 | 0 |
| గడుగ్గాయి | | 1 | 0 | 0 |
| చినరసాలు | | 0 | 8 | 0 |
| భగవద్గీతభాష్యం | 1 వ భాగము | 1 | 4 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| నాయుడు బావ | | 1 | 0 | 0 |

శ్రీ ఉమర్ అలీషా గారి

| | | | |
|---|---|---|---|
| ఉమర్ ఖయ్యాం | 3 | 0 | 0 |

శ్రీ విశ్వనాథ సత్యనారాయణరావుగారి

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రపౌరుషము | 0 | 6 | 0 |

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | కాంతం కైఫీయతు | 1 | 0 | 0 |
| 2. | కాంతం కాపురం | 1 | 0 | 0 |
| 3. | కాంతం | 1 | 0 | 0 |
| 4. | నేనూ మాకాంతం | 1 | 0 | 0 |
| 5. | మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | 0 |
| 6. | మునిమాణిక్యం కథలు | 1 | 0 | 0 |
| 7. | ఉపాధ్యాయుడు | 1 | 0 | 0 |
| 8. | తిరుమాళిగ | 1 | 0 | 0 |
| 9. | మేరీ కహానీ | 1 | 0 | 0 |
| 10. | దాంపత్య జీవితం | 1 | 0 | 0 |
| 11. | రేడియో నాటికలు | 1 | 0 | 0 |
| 12. | రాధబాబు | 1 | 0 | 0 |
| 13. | శరద్రాత్రులు | 1 | 0 | 0 |
| 14. | రుక్కుతల్లి | 1 | 0 | 0 |
| 15. | యధార్థ దృశ్యాలు | 1 | 0 | 0 |
| 16. | హాస్యకథలు | 1 | 0 | 0 |
| 17. | తల్లిప్రేమ | 1 | 0 | 0 |
| 18. | కథానికలు | 1 | 0 | 0 |
| 19. | దీక్షితులు | 1 | 0 | 0 |
| 20. | తగూ నెం. త్రీ | 1 | 0 | 0 |
| 21. | వినోద వ్యాసములు | 1 | 0 | 0 |
| 22. | నా స్నేహితులు | 1 | 0 | 0 |

వలయువారు:

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.